


"అమ్మాయిది ఆరేళ్ళ
ప్రాయం చేసేది భరత
నాట్యం, రసిక లోకమే
నర్తనశాల
హర్షిస్తుందిక లోకం!"

# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యిక

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

1 కి గ్రా ప్యాక్‌లో
కూడా దొరుకుతుంది
దీని లోపల ఉంది ఉచితంగా
లభించే
మగ్

పెరిగే వయస్సులోని పిల్లలు మరే మాల్టెడ్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఝామ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసీ కాదు. ఉంది అందులో మరేదో ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు తోడ్పడే ఆహార పానీయం.

క్యాడ్‌బరీస్
**బోర్న్‌విటా**
పిల్లలు సరిగ్గా పెరగడం,
అందుకే మరి బోర్న్‌విటా యివ్వడం.




OBM/3783 TEL

## అన్నీ రద్దే!

ఉద్యోగుల సౌకర్యాలు రద్దు
గ్రామోద్యోగుల పదవులు రద్దు
అకాడెమీలు రద్దు
ఆస్థాన పదవులు రద్దు
పంచాయితీ వ్యవస్థ రద్దు
ఇక చేసేందుకు ఏమీ లేదు
అందుకే చేశారు చివరికి
రాష్ట్ర శాసన సభ రద్దు!

—పి. రాంబాబు

## అమరజ్యోతి

"హే భారత జ్యోతీ! అమర జ్యోతీ!
మా అందరి హృదయాలలో అద్భుత జ్యోతివి
భారత రత్నపు బావి నెరుగక రత్నాన్నే
గుండు దెబ్బ కెర చేసే ఓ్క మూర్ఖుడు
రత్నము రత్నమే తాను ప్రకాశింపుచు
కోటి (కాంతి) కిరణాలను దశ దిశల వెదజల్లింది
ఇందిరా ప్రియదర్శిని అందరి హృదయాలలో
తన జ్ఞాపికలను జాగృతం చేసి దివి కేగింది
భారతరత్న భారత రత్నమ్మై భారతావనికేకాక
దేశ దేశాలకు శాంతి కిరణాలు వెదజల్లింది
శ్రద్ధాంజలు లర్పింపగ జనవాహిని ఘన వాహినియై
సాగర తరంగాలవోలె కదలాడింది
ప్రియ ప్రజలే గాక దేశ దేశాల నాయకులు నత మస్తకులై
ప్రణతాంజలి ఘటించేరు
నిన్నటి వరకు ప్రియదర్శిని ప్రియదర్శినియై
మధుర వాక్సరిలో మనలను ముంచింది
నేటినుండి భారతవాసుల హృదయాలను
మానవతా ప్రబోధముకై మరలించుగాక!
ఇందిర ఎప్పటికీ ఆరని అమర జ్యోతి!"

డి కామేశ్వరీదేవి న్యూఢిల్లీ




## స్మృత్యంజలి

అలీనోద్యమ దేశాలకు నాయికామణివి
జాతి ఐక్యత కొరకు పాటుబడిన నారీమణివి
మదుకంటె అతి తీయనైనవాణి గల వనితవి
భారతమాతకు ప్రశంస లందింప జేసిన మణివి
ప్రతి ప్రాణికి తప్పదు జననం – మరణం
సృష్టి కలిగించు మృత్యువునకు ఏదో ఒక కారణం
అమ్మా! ఇందిరమ్మా! నీ హఠాన్మరణం
మాకేకాదు యావత్ప్రపంచానికి తీరని శోకం
ఎన్నెన్ని సార్లు చెప్పినా తరగవు అమ్మ గొప్పలు
ఇవ్వే మా అమ్మకు మనస్ఫూర్తి జోహారులు
చాంద్ బడె సబ్ కహా ఇందిరా అమర్ రహె
జబ్ తక్ చాంద్ సూరజ్ రహె ఇందిరా తేరానామ్ రహె

మొహమ్మద్ ఖాజ కూసుమంచి

## ముఖచిత్రం

9–11–84 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖచిత్రం స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధి చాలా బాగుంది సీరియల్‌లో 'దేదీప్య చాలా ఆసక్తి-కరంగా వుంది

—ఆకురాతి నాగశ్రీనివాస్ గొల్లపూడి

## సీరియల్

దేదీప్య సీరియల్ ఇంటరెస్టింగ్‌గా సాగుతోంది

—శ్రీనివాసరావు హనుమంతు (బెంట) □




**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

వ్యవస్థాపకులు

**దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం 1908

**శివలెంక శంభు ప్రసాద్**
సంపాదకుడు
(1938-1972)

శుక్రవారం 7-12-84
శ్రీ రక్తాక్షినామ సం మార్గశిర శు చతుర్దశి

**సంపుటము 77 : సంచిక 14**

సంపాదకుడు

**శివలెంక రాధాకృష్ణ**

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మా సాల చందా | రు | 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 111-80 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం
కమల్‌హాసన్
(ఫోటో – కాజాస్)

# ప్రవేశపెడుతున్నాం
# జై కిసాన్
# సామ్రాట్
# 18:46:0




**మీ పంటలను ఉవ్వెత్తున పెరిగేటట్లు చేసేందుకు అత్యధిక ఫాస్ఫేట్ గలది.**

* 18% నత్రజని, 46% ఫాస్ఫేట్ (డీఏపీ) జోరుగా, తొందరగా పెంచగల బలవర్ధకమైన సంకీర్ణ రసాయనిక ఎరువు.
* వరి, చెరకు, ప్రత్తి, నూనె గింజలు, పప్పు ధాన్యాల్లాంటి పంటలు బాగా ఏపుగా పెరగటంకోసం, అధికంగావున్న ఫాస్ఫేట్ తోడ్పడుతుంది.
* నీటిలో పూర్తిగా కరుగుతుంది—దాని పూర్తి లాభం మీ పంటలకు అందుతుంది.
* అత్యధిక పోషక పదార్థాలు.. అతి తక్కువ ఖర్చులో!
* నత్రజని పూర్తిగా అమ్మోనియా రూపంలో ఉండటంవల్ల, నష్టపోవడం అంటూ ఏమీ ఉండదు.

# జై కిసాన్ ఎరువులు

**అత్యధిక దిగుబడుల కోసం అత్యధిక పోషణ.**

జువారి అగ్రో కెమికల్ లిమిటెడ్ గోవా

LINTAS ZUA 112 2315

# బాధ్యత, అధికారం పంచుకుని నిర్వహిస్తేనే ప్రజాస్వామ్యం




అధికారం అవినీతిని పెంచుతున్నదీ, నాశనం చేస్తున్నదీ కూడా సర్వాధికారం సర్వ నాశనానికి దారితీస్తుంది

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ భారత ప్రధానిగా మొట్ట మొదటిసారిగా మొదటి కామన్‌వెల్త్ సమావేశానికి హాజరు కావడానికి లండన్ వచ్చినప్పుడు ఆయన వెంట వచ్చిన శ్రీమతి గాంధీని మొదటి సారిగా నేను 1948లో కలిశాను అక్కడ భారత హై కమీషనర్ శ్రీ కృష్ణమీనన్‌కు నేను అంతరంగిక కార్యదర్శిగా ఉన్నాను శ్రీ కృష్ణమీనన్ అనారోగ్య కారణంగా నేను శ్రీమతి ఇందిరా గాంధీకి శ్రీ నెహ్రూకు స్వాగతం చెప్పి ఇండియా హౌసుకు తీసుకు వెళ్ళాను ఆఫీసు వెనుక భాగంలో ఉన్న మీనన్ నివాసానికి వారిని తీసుకెళ్ళి, శ్రీ మీనన్ గొంతుకి సంబంధించిన వ్యాధితో బాధపడుతున్నారు కనుక ఆయనను ఎక్కువగా మాట్లాడవద్దని చెప్పి వారిని అక్కడ వదిలేసి వెళ్ళిపోయాను శ్రీమతి గాంధీ వారితో అరగంట గడిపిన పిమ్మట నా ఆఫీసులోనికి అడుగు పెట్టారు ఆమెను నేను టీ తీసుకుంటారా! అని అడిగాను

ఆమె జవాబు ఇవ్వలేదు నేను మళ్ళీ అదే ప్రశ్న వేసినా ఆమె ఏమీ బదులు ఇవ్వలేదు నా మాట వినిపించుకోనట్లు కనబడింది ఆమెకు సిగ్గు ఎక్కువని, పెళ్ళి కూతురులాగ చాలా ఆకర్షణీయంగా ఉంటారు కాని కొద్దిగా గర్విష్ఠి అన్న అభిప్రాయం నాలో ఏర్పడింది ఆమె తండ్రి అంతస్తు పెరిగిన ఒక్క సంవత్సరానికే ఎదుటివారు తనకన్నా ముందు మాట్లాడ కూడదు అనేటువంటి రాజరికపు తత్వం ఆమెకున్నట్లు నాకు అనిపించింది తరువాత ఆమె లండన్‌లో ఉన్నంత కాలం, ఆమె గురించి నేను పట్టించుకోలేదు అవి కావాలి, ఇవి కావాలి అంటూ ఆమె దగ్గర నుండి వచ్చే టెలిఫోన్‌లకు నేను మాట్లాడకుండా ఫోను నా సహోద్యోగికి ఇచ్చేవాడిని నేనేమీ ఆమె అంతరంగిక కార్యదర్శినికాదు కనీసం ఆమె తండ్రికి కూడా కాదు కదా అని నేనే సమాధానం చెప్పుకున్నాను

ఐదేళ్ళ తరువాత నేను భారత దేశానికి తిరిగి వచ్చినప్పుడు ఢిల్లీలో నెహ్రూ ఆఫీసుకు టెలిఫోన్ చేసాను అప్పుడు కొంచెం సేపు మాట్లాడిన తరువాత ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు మళ్ళీ తనని కలవమని ఆయన చెప్పారు కారణం గుర్తులేదు గాని నెహ్రూ కోసం ఆయన నివాస గృహం అయిన తీన్‌మూర్తి భవన్‌కు ఫోనుచేయగా శ్రీమతి గాంధీ ఫోనుతీసి తమ తండ్రి ఇంట్లో లేరని, సాయంత్రానికి తిరిగి వస్తారని ఆ సాయంత్రం నన్ను వచ్చి టీ తీసుకోవలసిందిగా ఆహ్వానించారు

నిజానికి అది కొందరు విదేశీయులతో సహా 20 మంది ఆహ్వానితులతో కలిసి చేసే విందు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఇంకా రాలేదు ఆయన తరపున శ్రీమతి గాంధీనే విందు ఇచ్చే వ్యక్తిగా వ్యవహరిస్తున్నారు ఆమె అతి వినయంగా ఒకటీ అరా మాటలతో, చిరునవ్వులతో ప్రతి ఒక్కరినీ పలకరిస్తూ ఆనందపరుస్తున్నారు నేను ఆమె తండ్రికి లండన్ నుండి పంపిన పుస్తకం అందిందా అని అడిగినప్పుడు అందినదని చెబుతూ అదే రచయిత రాసిన మరి కొన్ని పుస్తకాలు కావాలని, ఆమె అడిగారు ఇంతలో శ్రీ నెహ్రూ రావడంతో మా సంభాషణ ఆగిపోయింది మళ్ళీ ఆమె నాకు కనుపించలేదు

ఒక ఫైనాన్షియల్ వార్తా పత్రిక బ్యూరో చీఫ్‌గా 1969లో నేను నా ఆఫీసులో కూర్చుని ఉన్నప్పుడు నాకు ఫోనొకటి వచ్చింది తాను ప్రధాన మంత్రికి సహాయకారినని, ప్రధాన మంత్రి నన్ను ఫలానా సమయంలో తమ కార్యాలయంలో కాకుండా తమ ఇంటివద్ద కలుసు కోవాలంటున్నారని ఫోనులో ఆయన చెప్పారు అది సెప్టెంబరు నెల అయి ఉండాలి ఆమె తమ సిండికేటు ముఠాని వదిలించుకొని తమ పార్టీని ఏర్పాటు చేసుకున్న తరువాత జరిగిన రాజకీయ పరిణామాల మధ్య కాలం అది ఆమె న్యూఢిల్లీలోని సీనియర్ పాత్రికేయులతో వ్యక్తిగతమైన సమావేశంజరిపి చర్చించా లనుకుంటున్నారని, పత్రికలలో దానిని రాయడానికి కాదని, నా ఒక్కడితో మాట్లాడా లనుకోవటం లేదనే ఉద్దేశంతో ఆ సమావేశానికి వెళ్ళకూడదు అని అనుకున్నాను అయితే అది నాకు మాత్రమే ప్రత్యేక ఆహ్వానం అని తెలిసినప్పుడు ఎంత

స్వర్గీయ ఇందిరా గాంధీ 67 వ జయంతి సందర్భంగా నవంబరు 19 న కొత్త ఢిల్లీలోని తీన్‌మూర్తి భవన్‌లో ఉప రాష్ట్రపతి శ్రీ ఆర్ వెంకట రామన్, శ్రీమతి గాంధీ జ్ఞాపకార్థం వెలువరించిన ప్రత్యేక తపాలా బిళ్ళని విడుదల చేసినప్పుడు తీసిన చిత్రం. ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధీ, కమ్యూనికేషన్‌ల సహాయ మంత్రి శ్రీ వి ఎన్ గాడ్గిల్‌లని చిత్రంలో చూడవచ్చు





స్వర్గీయ శ్రీమతి ఇందిరా గాంధీ 67 వ జయంతి సందర్భంగా నవంబరు 19 న కొత్త ఢిల్లీ లోని బోట్ క్లబ్ వద్ద జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తున్న ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధీ.

పోకూడదను కున్నప్పటికీ ఆ సమావేశానికి హాజరయ్యాను

శ్రీమతి గాంధీతో నా ఆఖరి అంతరంగిక సమావేశం ఒక విషాదాంతమైనది ఆమె బ్యాంకుల జాతీయీకరణ గురించి చెప్పటం ప్రారంభించారు ఏదో కుట్ర వంటిది, ఆర్థికంగా కన్నా రాజకీయ కుట్రవంటిదీ, నేను పని చేసే పత్రిక సంపాదకునితో సహా అభ్యుదయ వాదు లనబడే వాళ్ల చేత దండోరా వేయబడుతున్న బ్యాంకుల జాతీయకరణ నేపథ్యం గురించి శ్రీమతి గాంధీ వివరించడం ప్రారంభించారు ఆ సమావేశం ఆర్థిక విధానానికి సంబంధంలేని రాజకీయోద్దేశంతో కూడినదని స్పష్టంగా నాకు అర్థమయ్యింది నా అభిప్రాయా లేవీ చెప్పకుండా నేను శ్రోతలా కూర్చుండి పోయాను

కాని ఆమెను చివరిసారిగా 1953లో చూసినప్పటికి, 1969 నాటికి ఆమెలో ఏదో మార్పు కొట్టొచ్చినట్లు కనిపించింది అది ఎలా చెప్పాలో నాకు తెలీటంలేదు కాని ఆమె మొహంలో కళ తప్పింది గద్గద స్వరంతో పాటు ముఖంలో ముడతలు కూడా ఏర్పడ్డాయి ఆ సంవత్సరం ఆమెకూ, ఈ దేశానికి, మనందరికీ దురదృష్టకరమైనది అన్నిటా రాజకీయ ప్రయోజనాలని సంతరించుకున్న సంవత్సరం ఆమె తన స్వంత పార్టీనే నాశనం చేసుకున్న సంవత్సరం ఆ తర్వాత ఆరు సంవత్సరాలలోనే ప్రతి పక్షాలకి చెందిన పార్లమెంటు సభ్యులని జైలుకి పంపి దేశాన్ని మొత్తం పెద్ద నేరస్తుల శిబిరంగా మార్చివేయడం ద్వారా రాజ్యాంగాన్ని నాశనం చేయడం జరిగింది అత్యవసర పరిస్థితికి 1969 లోనే వేళ్లు నాటుకున్నాయి తమ స్వంత పార్టీలోని వారిని బయటికి వెళ్లగొట్టటం ద్వారాను, పి ఎన్ హక్సర్ లాంటి ఎందరో అధికార్ళు చంద్రశేఖర్ వంటి రాజకీయ వాదులతోనూ దానిని నింపడం ద్వారా ఆమె నిజమైన అధికారాన్ని చేజిక్కించుకున్నారు ఆమెను హత్య చేసి భౌతికంగా ఆమెను దూరం చేసిన మొన్నటి దుర్ఘటన, జరగటానికి చాలా కాలం ముందే ఈ కౌకస్ మురా శ్రీమతి గాంధీని నాశనం చేసిందనవచ్చు

ప్రజాస్వామ్యం అంటె కేవలం ఎన్నికలు, ఓట్లుకాదు మంత్రుల నుండి సెక్షన్ అధికార్ల వరకు, ప్రధాన మంత్రి మొదలు జవాన్ వరకు, పోలీస్ కమిషనర్స్ మొదలు బీటు కానిస్టేబుల్ వరకు అధికారం బాధ్యత పంచుకొని గురుతర బాధ్యతలు నిర్వహించినప్పుడే ప్రజా స్వామ్యం అనిపించుకొంటుంది శ్రీమతి గాంధీ వీటన్నిటిని తల క్రిందులు చేశారు 1969 తరువాత అధికారం పంచుకోవడం అన్నదిలేదు ప్రతిపక్షాలతో సంప్రదింపులులేవు కేవలం ఉత్తర్వులు జారీ చేయడం వీటిని వినే నాదుడు లేకపోతే ఎవరికి వారే అధికారాల్ని చేజిక్కించుకొని ఇష్టారాజ్యంగా ప్రవర్తించడం ప్రారంభమయింది ఆఖరికి ఆమెకు తెలియాల్సిన విషయాలు కూడా తెలుపక పోవడం జరిగింది ఆమె చుట్టూ చేరినవారు ఆమెకు హితమైనవే చెప్పడం ప్రారంబించారు ఆమెకి ఇష్టంలేని వాటిని చాప కిందకి తోయడం మొదలు పెట్టారు

శ్రీమతి గాంధీకి విధి నిర్వహణ అంటె ఎంతో ఇష్టం అయినా బాధ్యత, హక్కు అన్నవి రెండు వేరు వేరు విషయాలు ఇంత పెద్ద దేశాన్ని ఆమె తమ చెప్పు చేతలలో ఉంచుకోవాలని చూశారు కానీ ప్రజాస్వామ్యంలో ఏ ఒక్కరికీ ఆ హక్కులేదు ప్రజాస్వామ్యం పేరుతో ఎవరైనా అలా ఏలాలని ప్రయత్నం చేసినా అది కుదరదు కింద ఏం జరుగుతున్నదో శ్రీమతి గాంధీ గమనించి కాస్త మెళకువని ప్రదర్శించి ఉంటే ఈ దేశాన్ని పరిపాలించడానికి ఈనాడు ఆమె మన మధ్య ఉండేవారు ఇది చాలా విషాదకరమైన కథ కానీ చరిత్ర గతిలో ఇలాంటివి పునరావృతం అవుతూనే ఉన్నాయి □

# మొదటి రాత్రి

డాక్టర్. ఎస్. గంగప్ప




కళా పిపాసువులందరూ 'చిత్ర బహుమతి ఫలితాలకోసం ఎదురుచూస్తున్నారు ఈ బహుమతి తప్పకుండా ఈనాడు చాల ప్రసిద్ధ చిత్రకారుడు ఆర్ ఆర్ రాగులకే వస్తుందని అందరూ ఆశిస్తున్నారు అతి త్వరలోనే ఇది తేలిపోతుందని అనుకొంటున్నారు ప్రముఖాంధ్ర చిత్రకారుడు ఎన్ ఆర్ చిత్రాస్మృత్యర్థం విజయవాడలోని ప్రసిద్ధ పారిశ్రామికవేత్త 'చిత్ర బహుమతిని' ఏర్పాటు చేశాడు ఈ పారిశ్రామికవేత్త ఎన్ ఆర్ చిత్రా దూరబంధువుల్లోనివాడు తన ప్రేయసి పేరు కూడ చిత్ర చిత్ర జన్మ దినోత్సవాన్ని పురస్కరించుకొని ఏటేటా బహుమతిని ఇవ్వదలచి 'చిత్రాబహుమతి'ని స్థాపించాడు వాటర్ కలర్‌లోగాని, ఆయిల్ పెయింట్‌తోగాని చిత్రించిన చిత్రాలను ఎంట్రీకోసం ఆహ్వానిస్తుంది 'చిత్రా బహుమతి సంస్థ వచ్చిన ఎంట్రీలలో ప్రప్రదమ స్థానాన్ని పొందిన చిత్రానికి బహుమతి నిస్తారు ఈ బహుమతి విలువ పదివేల రూపాయల నగదు

ఆర్ ఆర్ రాగుల అప్పటికే ప్రసిద్ధిపొందిన చిత్రాకారుడు స్వదేశీయులైన దామెర్ల రామారావు సి ఎన్ వెంకట్రావు, అడవిబాపిరాజు, ఎన్ ఆర్ చిత్రా జి ఏ పద్మా మొదలైన ప్రముఖ చిత్రకారులు కార్టూనిస్టు తలిశెట్టి రామారావు, భారతీయ చిత్రాకారుడు రవివర్మ, కొంకపల్లి సమకాలిక చిత్రకారులు పి టి రెడ్డి, ఎ పైడిరాజు, కె రాజయ్య మంగళగిరి, జి సత్యం, శేషగిరిరావు, బాపు శంకర్ శీలాలి మొదలైన వారినీ, వారి చిత్రకళా నైపుణ్యాన్నీ ఒడుపులనీ మెళుకువలనీ బాగా గుర్తించిన వాడు ఆర్ ఆర్ రాగుల పైగా భారత ప్రభుత్వం ఏర్పాటుచేసిన పెలోషిప్పుతో బొంబాయి స్కూల్ ఆప్ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చర్ లో సర్వ ప్రదముడుగా ఉత్తీర్ణుడై ఆంధ్రప్రదేశ్‌కే గాక యావద్భారతానికే ఖ్యాతి దెచ్చిన సాటిలేని మేటి చిత్రకారుడు చదువు ముగిశాక ఢిల్లీలో కొంతకాలం చిత్రకళను ప్రాక్టీస్ చేశాడు ఆది అంతగా నచ్చక మకాం హైద్రాబాద్‌కి మార్చారు

మొదటి నుంచీ దిక్కులేనివారంటే, నిరుపేదలంటే ముదుసలి ముదుకులంటే రాగుల హృదయం కదిలిపోయేది కరుణ రసం పెల్లుబికేది లంబాడీలు కష్టజీవులు నాగరికతంటే తెలియని వాళ్ళు లంబాడీలు అలాంటి లంబాడీల కష్టాన్ని గమనించిన రాగుల లంబాడీ స్త్రీ బొమ్మను చిత్రించి ఆరంభ దశలోనే తన కళా ప్రతిబని ప్రకటించినవాడు హైద్రాబాద్ కళాభవన్‌లో ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ ఏర్పాటు చేసిన చిత్రకళా ప్రదర్శనలో ప్రదమ బహుమతికి నోచుకొంది ఈ లంబాడీ లతాంగి చిత్రం దాంతో మేటి చిత్రకారుడుగా రాగులకు పేరు రావడంతో అత్యుక్తిలేదు అదే సందర్భంలోనే లంబాడీ లతాంగి చిత్రాన్ని చూసి ముగ్ధురాలైన ఒక సంపన్న కుటుంబానికి చెందిన నవయువతి తన చిత్రాన్ని చిత్రించమని రాగులను అభ్యర్థించింది ప్రతిఫలంగా ఎంత డబ్బైన ఇస్తానంది కాని ఇది గిట్టని రాగుల తిరస్కరించాడు ఖిన్నురాలై వెళ్లిపోయింది ఆ యువతి

ఒకానొక ఉదయం రాగుల ఇంటి ముందు ఒక ముదుసలి బిచ్చగత్తె కనిపించింది వంకర టింకరైన పాతకళ్లజోడు, చాలీ చాలని అతుకుల బొంత పైన ఎడమ చేతిలో ఊతకర్ర కుడిచేతిలో బొచ్చె, గూనువంగి గజ గజ వణకిపోతూంది చూచిన మర్ధు క్షణమే రాగుల ఆ మోడల్‌ని గ్రహించి బొమ్మ చిత్రించాడు చిత్రిస్తూన్నంతసేపు అక్కడే ఉండిపోయింది ఆ ముసల్ది తుది మెరుగులకోసం చిత్రాన్ని తన గదిలోకి పట్టుకెళ్లాడు తానెంతో విజయం సాధించినట్లు బావిస్తూ అదే సమయంలో ఆ ముదుసలి అంతగా వణకి పోతూన్న దల్లా దగ్గర్లోనే ఆగివున్న కారులో ఎక్కి తుర్రున వెళ్లిపోయింది ఆ ముదుసలి మనిషి టాలూకు సంగతులు ఆరాతీద్దామన్న ఆదుర్దాతో లోపల నుంచి వచ్చాడు రాగల కాని అక్కడ ముసలిదాని ఆచూకీలేదు ఆశ్చర్య చకితుడయ్యాడు తాను హైదరాబాద్‌లో వున్నాడన్నమాటేగాని ఎక్కడో వనస్థలిపుర శివార్లలో ఉంటున్నాడు తానున్న చోట జన సమ్మర్ధంగానీ, సిటీ హడావిడిగానీ ఉండదు ఎంతో ప్రశాంతంగా తన చిత్ర రచనకు ఉపకరించే చోటు అది అక్కడ ఎవరూ లెరు అడిగి తెలుసుకొందామంటే ఉద్విగ్నుడై అలా వుండిపోయాడు ఆలోచిస్తూ

కళాభవన్‌లోని ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి పక్షాన ఏటా జరిగే చిత్రకళా ప్రదర్శనలో కళా పిపాసువులు అందరినీ అత్యంతం ఆకర్షించిన చిత్రం 'ముసలిది వార్తా పత్రికలన్నీ దీని విశిష్టతని

సవిమర్శకంగా చాటాయి ఎంతో మంది తనివితీరా ఆ చిత్రాన్ని దర్శించి మెచ్చుకొన్నారు ప్రశంసల- పరంపరలు రాగుల చిత్ర కళానైపుణ్యాన్ని గూర్చి అనేకం వచ్చాయి ఈ సారి గూడా ప్రథమ బహుమతి రాగుల చిత్రం 'ముసలిది'కే దక్కింది అకాడమీ బహుమతితో పాటు ఎందరో చిత్ర కళాభిమానులు ముగ్ధులై ఉడుతాభక్తిగా తమకు తోచినంతగా వ్యక్తిగత బహుమానాలు ప్రకటించారు అదే రీతిని ఓ యువతి తన కోరిక ఈ విధంగా తీరిందనీ, ఈ చిత్రానికి వ్యక్తిగత బహుమతిగా 10వేల రూపాయల చెక్కు సీకరించ వలసిందని రాగులను కోరింది అంతాగురుతుకుతెచ్చుకొన్నాడు రాగులు అర్థం చేసుకొన్నాడు క్షణం ఆలోచించి ఓ నిర్ణయాని కొచ్చినట్లు తలూపి ఒక షరతుకు అంగీకరిస్తే తాను బహుమతిని స్వీకరిస్తానన్నాడు రాగుల ఆ యువతి సిద్ధమేనంది తనకు 'మోడల్ గాఉండే పక్షంలో దాన్ని స్వీకరిస్తానన్నాడు చిత్రకళ మీద అభిమానమే- కాదు, అభినివేశమున్న ఆ యువతి అదే మహ- ద్భాగ్యంగా భావించి రెండో ఆలోచన లేకుండానే అంగీకరించింది అతను చెక్కు స్వీకరించాడు ఆ విధంగా ఆ యువతిని మోడల్‌గా చేసి



ఎన్నెన్నో రకాల బొమ్మలు చిత్రించి జాతీయంగానే గాక అంతర్జాతీయంగాను ప్రఖ్యాతి పొందాడు రాగుల

నిరుపేదగా జీవితాన్ని గడుపుతున్న రాగుల అనుకోకుండా అనంతమైన ఆస్తిపాస్తులకు వారసుడయ్యాడు తన ఆస్తినంతా కాజేయాలన్న తలంపుతో మోసం చేసిన దాయాదులపై కోర్టులో కేసు పెట్టి గెల్చిన తనకు మిగిలిన తాత మరణంతో అస్తంతా రాగులకు సంక్రమించింది ఆస్తి అజ- మాయిషీ కోసమైతేనేమి, ఇతర కారణాల వల్లనైతే- నేమి తెలుగు నాడు నడిబొడ్డు అయిన గుంటూరుకు మార్చాడు మకాం రాగుల తన వారంటూ ఎవరూ లేని లావణ్య 'మోడల్'గా ఉండటానికే నిశ్చయించు- కొంది గనుక రాగులతో పాటు గుంటూరు వచ్చేసింది తనకు వలసిన డబ్బు అంతా ఫిక్సెడ్ డిపాజిట్లలో ఉంది తల్లిదండ్రులు వ్యాపారంలో సంపాదించిన ఆస్తినంతా లావణ్యకు సంక్రమించేలా చేసి వెళ్ళి- పోయారు తానూ గుంటూరు వస్తానంటే వద్దనలేదు రాగులు పైపెచ్చు సంతోషించాడు

గుంటూరులో లక్ష్మీపురంలో చక్కటి డాబా భవనం విశాలమైన ప్రాంగణం అందులో తీర్చి దిద్దినట్లున్న తోట రక రకాల పూల మొక్కలు కన్నుల పండువు చేస్తున్నాయి

పుష్ప సుగంధం నాసా పుటాల్లో ప్రవేశించి మామూలు వ్యక్తుల్నే మత్తెక్కిస్తుంది డాబాలో తన రక రకాల చిత్రాల్ని కళాత్మకంగా అమర్చిపెట్టాడు రాగుల ఒక పక్కగా లావణ్య శిక్షణ పొందుతూ చిత్రించిన చిత్రాలున్నాయి హాలుకు ఒక పక్క పడక గది దాన్నానుకొని డ్రెస్సింగు రూమ్ మరో ప్రక్క చిత్ర కళకు సంబంధించిన సామగ్రితో నిండిన గది హాల్లో ఒక మూలగా చిత్రాలు చిత్రించ- డానికి కేన్వాసు అమర్చిన బోర్డు రంగులు కుంచెలు మొదలైన చిత్ర కళా సంబంధి సామగ్రి ఏర్పరచిన బల్లలు, ఎదురుగుండా 'మోడల్ ఉండడానికి తగిన వేదిక అన్ని ఏర్పాట్లు కళాత్మకంగా చేయబడి ఉన్నాయి అందులో ప్రవేశించిన వాళ్ళెవరైన ఆ వున్నంతసేపు ఒక కళా జగత్తులో విహరిస్తున్నట్టే అనుభూతిని పొందుతారు అందరినీ ఆకర్షించే రెండు కళా ఖండాలు ఒకటి లంబాడీ లతాంగి, రెండు ముసలిది

ఈ రెండు తైల వర్ణ చిత్రాలు స్కెచ్ గీయడంలో వాటర్ కలర్ సమ్మేళనం చేయడంలో తైల వర్ణాల్ని తీర్చి దిద్దడంలో రాగులకు రాగులే సాటి అనంత కళా విజ్ఞాన ఖని రాగుల

రాగుల తల్లి ప్రేమకు నోచుకోలేదు తన జననమూ, తల్లి మరణమూ ఒకేసారి జరిగి- పోయాయి తన బాల్యంలోనే తండ్రి గతించగా తాత పెంచి పెద్ద చేశాడు అలా పెరిగిన తనకు 'శకుంతల అంటే ప్రత్యేకమైన అబిమానం శకుంతల పేరెత్తితే తన హృదయం ద్రవిస్తుంది ముగ్ధ సుకుమార అయిన శకుంత తపో వనంలో చెలికత్తెలతో మొక్కలకు నీళ్ళు పోస్తున్న చిత్రాన్ని చిత్రించాలని ఎంతో కాలంగా ఆశిస్తూ వచ్చాడు ఈనాడు 'చిత్రా బహుతి' కోసం ఆ చిత్రం చిత్రించాలని సంకల్పిం- చాడు తగిన మోడల్ లావణ్య వుంది గనుక తన కోరిక సిద్ధిస్తుందని తప్పక, తన పేరు మరోసారి మార్మోగిపోతుందనీ బావించాడు చిత్ర రచనకు సర్వం సిద్ధం చేసుకొన్నాడు మోడల్'గా శకుంతల వేషంలో లావణ్య డ్రెస్సింగ్ రూమ్‌లో నుంచి ప్రత్యక్ష- మైంది ఆ ముగ్ధ మోహనాకార, అతిలోక లావణ్య లావణ్యను చూచిన రాగుల హృదయం రాగ రజిత- మైంది ఎంత మంది యువతుల్ని చూడలేదు తాను పై పెచ్చు మోడల్‌గా లావణ్య కొంత కాలంగా ఉంటూ వచ్చిందే? అయినా ఈనాడు ఎందుకింతగా తన హృదయం అకృష్టమయిందా అని తలచే అవ- కాశమే లేకుండా పోయింది తానూహించిన శకుంతలలో ఉండవలసిన మరి కొన్ని చిహ్నాల్ని లావణ్యకు దిద్ది తీర్చే పనిలో నిమగ్నుడయ్యాడు కానీ తన మనసు మాత్రం తన వశంలో లేదు అనంతానురాగ లోకాల్లో విహరిస్తుంది లావణ్య- వన్నె చిన్నెలు సవరిస్తూ రసానుభూతికి లోనై- పోయాడు ఇది కేవలం శారీరక వాంఛ హేతువు అనడానికి వీలు లేదు ఆ స్థితిలో ఆతని మనస్సు లావణ్యపై సంలగ్నమైంది లావణ్య చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొన్నాడు కాదనలేదు లావణ్య బిగియార కౌగలించుకొన్నాడు అడ్డు చెప్పలేదు పువ్వు వలే కరిగిపోయింది ముద్దుల వర్షం కురిపిం- చాడు మురిసిపోయింది పారవశ్యంలో పరమా- నందానుభూతిని పొందింది పడక గదిలోకి నడిచాడు కాదని లేదు తాను అనసరించింది అంతరాంతరాల్లో ఇది 'మొదటి రాత్రి అన్న అనుభూతి మెదిలింది అనంత స్వర్గ సౌఖ్యానుభూతి పొందిన రాగుల తన ఆరాధ్య దేవత' అంటూ లావణ్య ఒడిలో ఒదిగిపోయి అర్ధ నిమీలిత నేత్రుడై- నిద్రలోకి జారిపోయాడు రాగులని నిద్రబుచ్చి హాల్లోకి వచ్చి చిత్ర రచనలో నిమగ్నురాలైంది లావణ్య

చిత్ర బహుమతి పోటీ ఫలితాలు ప్రకటించ- బడ్డాయి కళాపిపాసువులు ఆశించిన రీతిగా బహుమతి ఆర్ ఆర్ రాగులకి రాలేదు ఇంత వరకూ ఎవరూ వినని పేరు బహుమతి గ్రహించిన చిత్రకారిణి శ్రీమతి లావణ్యారాగుల బహుమతి గెల్చుకున్న చిత్రం 'మొదటి రాత్రి' అందరూ ఆశ్చర్య సముద్రంలో మునిగిపోయారు □

# వ్యక్తిగతం



సర్ రిచర్డ్ స్టోన్ 1984 వ సంవత్సరానికి ఆర్థిక శాస్త్రంలో నోబెల్ బహుమతిని అందు కున్నారు. 71 సంవత్స రాల వయసుగల ఈయన కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పని చేశారు....



కాలిఫోర్నియాలోని లోమాలిండా విశ్వ విద్యాలయానికి చెందిన వైద్య కేంద్రంలో 'బేబీఫే' (అసలు పేరు, తల్లిదండ్రుల పేర్లు వెల్లడించలేదు) అనే వారాల వయసులో ఉన్న పసిపాపకు గుండె మార్పిడి శస్త్ర చికిత్సచేసి బాబూన్ (తోకలేని కోతి) గుండెని అమర్చారు....



డాక్టర్ (శ్రీమతి) స్నేహ భార్గవ కొత్త ఢిల్లీలోని అఖిల భారత వైద్య సంస్థకి ఆరవ డైరెక్టర్‌గా నియమితులైనారు. ఈ పదవిని అలంకరించిన తొలి మహిళ ఈమె. గత 24 ఏళ్ళుగా ఈమె ఈ సంస్థలో పనిచేస్తున్నారు. రాష్ట్రపతికి గౌరవ రేడియాల జిస్టుగా ఉన్నారు. వందకి పైగా పరిశోధనా వ్యాసాలని వివిధ పత్రికలలో ప్రచురించారు. భారత వైద్య పరిశోధన మండలి, జాతీయ వైద్య విజ్ఞాన అకాడెమీ మొదలైన వాటిలో నైపుణ్యంగల సభ్యురాలిగా ఉన్నారు

# వారఫలం

**7-12-1984 శుక్రవారం మొదలు**

**13-12-1984 గురువారం వరకు**

★ **మేషం** : ఇప్పటికైనా ఉద్యోగ వృత్తులందు ప్రశాంతి చిక్కిందని ప్రారంభించిన నూత్న వ్యాపారం లాభదాయక మవుతుందనీ గ్రహింప గలుగుతారు ప్రభుత్వాదరణ లభిస్తుందని ఆశించటం పొరపాటని గ్రహింప గలుగుతారు స్త్రీలకు పొరపాట్లు చేసి దిద్దికోవటం విశేషం అంతో యింతో ధన లబ్ధి లేక పోలేదు

★ **వృషభం** : పెద్ద ప్రమాదం తప్పినట్లవుతుంది బాధా నివారణ మైనదని సంతోష పడుతారు దురభ్యాసాల వలన కొందరు బాగా దెబ్బ తింటారు వారాంతానికి 'అశుభ వార్త' వింటారు పరులచేత నిలచిన పైకం అందటం వార విశేషంగా భావించాలి స్త్రీలకు నూతన మిత్ర పరిచయం, అంతస్థు పెరగటం గమనింపదగిన అంశాలు

★ **మిధునం** : అసాధ్యమనుకొన్న వ్యవహారం సులభంగా మీకు అనుకూలం ఎంతో కాలంగా యింటికిరాని పరిచితులో, మిత్రులో, బంధువులో యింటికి రానున్నారు అతిథి, అభ్యాగతుల నాదరించటంతో కాలం వ్యయిస్తారు రాజకీయంగా కూడా మీకు మేలు కనిపిస్తుంది అన్ని రంగాలలో మీ ప్రతిభ రాణిస్తుంది స్త్రీలకు ఉద్యోగాభివృద్ధి ధనాదాయం

★ **కర్కాటకం** : విధి విరామం లేకుండా శ్రమించటం జరుగుతుంది ప్రజా రంగాన మీకు కీర్తి అభివృద్ధి నందే సమయం గ్రామంలో గాని, ఉద్యోగరీత్యా గాని అభివృద్ధి కనిపించటం గమనించ గలుగుతారు ఒకానొక వ్యవహారం సులభంగా నెరవేరుతుంది స్త్రీలకు గృహం మార్పు చేయవలసిన అగత్యమో, ఉద్యోగ మందు మార్పో కనిపిస్తుంది

★ **సింహం** : ఎంతో కాలంగా కొనుగోలు చేయలేకపోయిన వస్తువులో, వాహనమో ఈ వారం కొంటారు 'శని గ్రహానుకూల్యత వలన అన్ని రంగాలలో మీకు అభివృద్ధి కనిపిస్తుంది నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది స్త్రీలకు రాజకీయంగా, సాంఘికంగా మేలున్నది

★ **కన్య** : వృత్తి, ఉద్యోగాలందు ఊహింపరాని మార్పు ఏర్పడుతుంది కొందరు నూత్న వ్యాపారం ఆరంభించుటకు అదనైన వారం వృత్తిలో పెంపు, రాజకీయంగా ఆదరణ లభింప నున్నది పెద్దల పరిచయంగాని, ధనాఢ్యుల పరిచయం కాని లభ్యం కానున్న వారం స్త్రీలకు సంగీత సాహితీ పరిశ్రమ యందున్న వారికి వికాస మున్నది వృత్తిరీత్యా పెంపు చెప్పదగిన ముఖ్యాంశం గ్రహించండి

★ **తుల** : చేసిన పని చేయటంతో పోయిన చోటికే పోవటంతో తప్పులు దిద్దుకోవటంతో క్రయ విక్రయాలలో చేసిన పొరపాట్లు దిద్దికోవటంతో వారం గడచి పోతుంది వృత్తి గాని, ఉద్యోగం కాని శ్రమకరంగా ఉండటం' గమనించ గలుగుతారు స్త్రీలకు కాని వారిచే బెడద, వస్తువులు పోగొట్టుకోటం, కొందరకు అపనిందలు తప్పక పోవటం

★ **వృశ్చికం** : దూర బారాలకు ప్రయాణించటం జరుగుతుంది వృత్తి యందు ఏదో మేలు చేకూరగల అవకాశ మున్నది నిరుత్సాహత తొలగిపోయే అవకాశ మున్నది అదికారం పెంపొందుటకు అనుకూల వారమే శ్రమించుట కూడా అవసరమే స్త్రీలకు రాజకీయంగా, వ్యాపార రీత్యా, ఉద్యోగరీత్యా సర్వానుకూల్యత గల వారంగా భావించాలి

★ **ధనుస్సు** : ఉద్యోగం కొరకు చేసిన ప్రయత్నాలు వ్యర్థమైనాయి అనుకొన్నారుగా' మరి యిప్పుడో! మీకు సంతానానికి ఉద్యోగం చిక్కటం ఖాయమైనదిగో! వ్యాపార రీత్యా గాని వ్యవహార రీత్యా గాని కొందరు ప్రయాణింప నున్నారు స్త్రీలకు అన్ని రంగాలలో ఉత్తమ ఫలాల నందికో నున్నారు శ్రమించండి

★ **మకరం** : రచనా విధానంలోగాని, పత్రికలకు వ్రాయు టయందుగాని 'సినీ డైలాగులు నాటకాలు వ్రాయు టయందుగాని మీకు ప్రావీణ్యముంటే సదవకాశాలు లభ్యం కానున్నవి, అందుకు తగిన ఆదాయం కూడా లభ్యం కానున్నది అలవాటుకు మీరు చేసే ఒకానొక వ్యవహారంలో హటాత్తుగా అంతరాయం కలుగనున్నది స్త్రీలకు వైజ్ఞానికంగాపెంపు గలదు

★ **కుంభం** : దూరప్రాంతాలకు ప్రయాణించుట సంభవం ఒక వేళ కొందరకు విదేశ ప్రయాణం కూడా తగలవచ్చు ఉద్యోగ మందు అనుకూల మార్పు సంభవం రచనా విధానంలో నూతనోత్సాహానికి అవకాశమున్నది స్త్రీలకు ఇంట శుభం జరగటం, ఉద్యోగ రీత్యా పెంపు కనిపిస్తుంది

★ **మీనం** : చాల కాలంగా కాని వారితోగాని, యిరుగుపొరుగుతో రగులుకొంటున్న తగాదాలు విజృంభించగలవు ఓర్మితో సంచరించటం అవసరం ఆదాయానికి ఏలాంటి యిబ్బంది లేదు విలువ గల వస్తు సేకరణకు అవకాశమున్నది, గ్రహించాలి స్త్రీలకు నూత్న విధంగా ఆదాయం, వృత్తి యందు పెంపు గమనించగలరు

**–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**

సీరియల్

# కాగితప్ప పడవలు

యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

(గత సంచిక తరువాయి)

ఇన్నాళ్ళులేని మరో చింత వాళ్లను పట్టుకుంది – పెద్దపిల్ల పెండ్లి కాకుండ రెండో పిల్ల పెండ్లి జరిగిపోవడం

"అబ్బాయి రామం! ఎలాగైన ఒక సంబంధం విశాఖలో కనుక్కోరా మీ ఆఫీసులోగాని ఆ అమ్మాయి జయలక్ష్మి ఆఫీసులోగాని ఏ క్లర్కుంటే చూడు మరి ఈ అమ్మాయికిచ్చినట్లే పెద్దమ్మాయి కిస్తామని చెప్పు"

రామారావుకి నవ్వాలో యేడవాలో తెలియదు గవర్నమెంటు ఆఫీసులో పని చేస్తున్న ప్యూను కూడ అయిదువేల రూపాయలకు పెండ్లికి ఒప్పుకోని రోజులివి తండ్రి ఆశకు రామారావుకి విచారం కల్గింది

"ఏమి రామారావు అలా డల్‌గా ఉన్నావు? అని ఓనాడు జయలక్ష్మి వాల్తేరు ఫ్లాట్‌ఫారంమీద అడిగింది

"ఏం చెప్పమన్నావు నీ ఇంటి సమస్యలతో నీతల భారమ్మైయుంటే నేను నా ఇంథి గొడవలు చెప్పి మరీ బరువెక్కించడం సబబుకాదు"

"అదేమికాదు – స్నేహితురాలిగా నాకు తోచినంత సహాయం చేయడం, చేతకానప్పుడు నా సానుభూతి ప్రకటించడం నా విధి

"అవుననుకో – నీతో చెప్పుకుంటే నాకు కొంత తేలికగ ఉంటుంది

"చూడు రామారావు, ఐశ్వర్యాన్ని, ఆనందాన్ని పంచుకుందుకు యెందరో స్నేహితులుంటారు – గాని లేమిని, కష్టాల్ని పంచుకుందుకు ముందుకు వచ్చినవాళ్లే నిజమ్మైన స్నేహితులనుకో

"ఐనో – జయా ఈజ్ మైబెస్ట్ ఫ్రెండు," అని చిరునవ్వుతో అన్నాడు

**జరిగిన కథ 5 : రామారావుని తన కుటుంబ సభ్యులకు పరిచయం చేస్తుంది జయలక్ష్మి. రామారావు జయలక్ష్మిని తన ఇంటికి తీసుకుపోతాడు. పార్వతి పెళ్లి జరిగి-పోయింది.**

అబ్బా! ఇంతసేపటికి మబ్బు తొలగింది ఇప్పుడు చెప్పు నీ వర్రీ ఏమిటో

ఏముంది మా చెల్లెలు పార్వతికి పెండ్లి అయి అత్తవారింటికి వెళ్లి-పోయిందా, ఇప్పుడు అందరు మా పెద్ద చెల్లెలు సుభద్ర పెండ్లి గురించి కాకుల్లా పొడిచేస్తున్నారు దాంతో మా అమ్మ, నాన్న ఖిన్న వదనులై కూర్చున్నారు మా పెద్ద చెల్లెలు సుబద్ర స్పోర్టివ్‌గానే తీసుకుందనుకో, గాని మనస్సులో కాస్త కించ ఉంటుందిగ ఇప్పుడెక్కడ దొరకుతాడు చెప్పు పెండ్లి కొడుకు?"

"చూడు రామారావు – ఇవన్ని మధ్య తరగతి జీవితాలలో ఉన్న ఇబ్బందులే మా ఇంటి పరిస్థితులే తీసుకో – మా నాన్నకు ఉద్యోగంలేదు, ఆస్తిలేదు ఇప్పుడు మా పెద్దక్క విధవ అయి పిల్లడితో ఇంటికి చేరింది దాని అత్తవారు మోసంచేసి దానికి ముట్టవల్సిన డబ్బు ఇవ్వలేదు నాకా పెండ్లి కాలేదు – నా చెల్లెలుకి అంతకన్న పెండ్లి కాలేదు పైగ చదువుకుంటున్న-తమ్ము డింట్లో ఇవన్ని సమస్యలేగా ధైర్యంగ ఎదురుకోవాలి – గాని ఉత్సా-హాన్ని, ధైర్యాన్ని, కోల్పోకూడదు నేను చూడు ఎంత కులాసాగా యున్నానో

రామారావు పరీక్షగ జయలక్ష్మి ముఖంలోకి చూచేడు ఆమె కండ్లలో ఆ ప్రశాంతత, ఆమె పెదవులపై ఉల్లాస భరితమ్మైన ఆ చిరునవ్వు చూచేసరికి రామారావుకి కొండంత ధైర్యం కల్గింది జయలక్ష్మి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని –

"థాంక్యు జయా – థ్యాంక్యు అని ఉత్సాహంగ అన్నాడు

"దట్ ఈజ్‌ది ప్రోపర్ ఏటిట్యూడ్ – మైబాయ్ అంది జయ

"అంది సరే – మేము సంబంధాలు వెతుకున్నాం, నీ యెరికిన ఏవైన ఉంటే చెప్పు"

"అలాగే – రామారావు వచ్చే సెకండ్ సాటర్ డే ఆఫీసుకు సెలవు కదా ఇంటికి కొన్ని సామాన్లు కొనాలి విశాఖపట్నం వద్దామనుకుంటున్నాను నాతో వస్తావా?"

"సరే – ఇంటి దగ్గర భోజనం చేసుకుని మధ్యాహ్నం బండికి వద్దాం సాయంత్రం అలా బీచికిపోయి గడుపుదాం – ఏం?

"ఒకే"

మూడు రోజుల తరువాత ఇద్దరు విశాఖలో కలసేరు బజార్లో సామాన్లు కొనుక్కుని బీచికి చేరేరు ఆనాడు జయలక్ష్మి ఉల్లాసంగలేదు రామారావు ఈ విషయాన్ని గమనించేడు బీచిలో కూర్చున్న తరువాత ఆ విషయాన్నే అడిగేడు

"ఏం చెప్పమన్నావు – దిగువ మధ్య తరగతి కుటుంబాల బ్రతుకులు చాల నిర్భాగ్యమ్మైనవి అంతా డబ్బుతోనే లేదనుకో – గాని జీవితాలను ఎంతో ఉల్లాసంగ గడపుదామన్న – ఆ మనశ్శాంతిని దేముడు, మన చుట్టు ఉన్న మనుష్యులు దక్కనివ్వరు"

"అవును – మనలాంటి వారి జీవితాల నిండ సమస్యలే మనని ఆదుకునే మనుష్యులే కరువైపోతారు పోనీ నీకు నేను నాకు నువ్వు ఉన్నాంగా, చెప్పు జయా నీ సమస్య ఏమిటో ?"

కొన్నేపు జయలక్ష్మి మౌనంగ ఊరుకుంది, చేతిలో ఇసకను సన్నటి ధారగచేసి క్రిందకు వంపుతూ రామారావు తొందర చేయలేదు ఆఖరికి జయలక్ష్మి ఓ నిర్ణయానికి వచ్చింది

"రామారావు! మా చెల్లెలి సంగతే దాని ప్రవర్తన బాగులేదు మాకు భయంగనుంది"

"సుమతి చాల సౌమ్యంగతోచిందే – ఏం జరిగిందేమిటి?

"ఇంతవరకు ఘోరమేమి జరిగిపోలేదు – కాని జరుగుతుందేమోనని భయంగానుంది ఏం చేయడానికి తోచడంలేదు

"సంగతేమిటో వివరంగ చెప్పు – నేను తగిన సలహా ఇస్తాగా

"సుమతి ఇంట్లో ఉండదు మాకు దూర బంధు వొకామె రెండు వీధులవతల ఉంది ఆవిడకు భర్తలేదు మేమేదో వరుసకు శకుంతలత్త

అని పిలుస్తాం ఆవిడ భర్త ఏదో పడవలలో ఉద్యోగంచేసి బాగా గడించేడు మా ఊరులోనే స్వంత డాబా ఇల్లుంది దగ్గర్లోనే ఏవో పంట భూములున్నాయి ఆవిడకు ఒక కొడుకు, ఒక కూతురుంది ఆ కొడుకు పేరు జగ్గారావు స్కూలు ఫైనల్ ఎలాగో నానాతంటాలు పడి పాసు అనిపించుకున్నాడు ఒడ్డూ, పొడుగు ఉన్న మనిషి ఇప్పుడు దగ్గర దగ్గరకు పాతిక యేళ్ళు వచ్చిన ఉద్యోగం సద్యోగంలేదు పనీపాటు లేక తండ్రి గడించిన ఆస్తి తగలబెట్టూ జులాయిగ ఊర్లోను లేకపోతే విశాఖపట్నంలోను తిరుగుతుంటాడు వాడింటికి ఇది రోజు కొకసారైన, వాడి చెల్లెలు పేరు పెట్టుకుని వెళ్తుంటుంది – వాడు ఇట్లాంటి విషయాలలో నీతి నియమం ఉన్నవాడు కాదు ఇది చెప్తే వినదు ఏం చెయ్యమన్నావు చెప్పు?

"సుమతికి వయస్సుతోపాటు, ప్రపంచ జ్ఞానం కల్గలేదు ఇంకా చిన్నతనం వదలలేదు కాస్త అనురాగంతో నచ్చ చెప్పాలి వాళ్ళిద్దరి మధ్యన ఏమైన అనుబంధం ఉన్నట్లు ఆదారాలేవైన దొరకేయా?

ఉత్తరాలుగాని, వాడు మా ఇంటికి తరచు రావడంగాని లేదు

"మరి?

"ఎక్కడకు తిరిగి వచ్చేవే అంటే శకుంతలత్త ఇంటికి అంటుంది

"అంతేకదా – నిజంగ అందులో కుంభకోణం ఏదైన ఉంటే అంత ధైర్యంగ వాళ్ళ పేరు చెప్పదుకదా పైగా జగ్గారావు ఎప్పుడు ఊరిమీదే తిరుగుతుంటాడన్నావుగ – అందుకే నిజంగ సుమతి వాడి చెల్లెలుకోసం వెళ్తుందేమో!"

ఏమోగాని దాని అప్రమత్తత, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుండడం చూస్తుంటే నా కేదో జంకుగా ఉంది

ఆగినాను – నువ్వేనా మీ అక్కయ్య కమలమ్మేనా అట్లాంటి పోకడలవల్ల కల్గిన నష్టాలేమిటో వివరంగ ధైర్యంగ చెప్పండి

పదపోదాం – ఎలా జరగాలో అలాగే జరగనీయ్ దాని అవివేకంవల్ల అది గోతిలో పడితే నేనేం చేసేదిలేదు ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు

వేదాంతం చెప్పి ధైర్యాన్నికోల్పోకు

మరి – ఇరవైనాల్గు గంటలు దాన్నెక్కడ కాపలా కాయగలం చెప్పు – నీతులంటే బోదిస్తాంగాని

అది కాదు నేనన్నది – వాళ్ళ వివేకాన్ని మనం మేల్కొల్పాలి

ఇద్దరు తిరుగు ప్రయాణం అయేరు

## 10

సుమతి! మునుపటిలా తరచు రావడం లేదేమి?

ఎలా రాగలను చెప్పు – మా వాళ్ళకు కాస్త అనుమానం తగిలింది బయటకు వెళ్తానంటే ఎన్నో ప్రశ్నలు అసలు నిజం వాళ్ళకు తెలియదనుకో

నిన్ను చూడందే ఉండలేక పోతున్నాను తెలుసా?

పైగ ఎప్పుడో ద్దామన్న నీ చుట్టు మనుష్యులే

మరేం చెయ్యమన్నావు చెప్పు – ఒచ్చిన వాళ్ళను నువ్వెప్పుడొస్తావో తెలియందే పొమ్మనలేను కదా పోనీ ఇప్పుడైనా వచ్చేవు నాకదే సంతోషం

ఇప్పుడెలా వచ్చాననుకున్నావు – మా అక్కయ్య తన కొడుక్కి నిక్కరు చొక్కా కుట్టించుకుని రమ్మంటే ఆ నెపం పెట్టుకుని ఇలా వచ్చాను ఇల్లు వదలి వెళ్ళడమంటే ఓ యజ్ఞం అయిపోయింది

సుమతీ! నిన్ను రోజు చూడందే, నీతో మాట్లాడందే బ్రతుకలేకపోతున్నాను ఏపని చెయ్యలేకపోతున్నాను తిండి సరిగ్గా తినడంలేదు నిద్ర సరిగ్గాలేదు ఎప్పుడు నీ గురించి తలంపే

నాకూ అలాగే ఉంది – గాని ఏం చెయ్యగలను చెప్పు?

నువ్వు కోపగించుకోనంటే నేనో ప్లాను చెప్తాను నువ్వు ఒప్పుకుంటే ఇద్దరం హాయిగా ఉండొచ్చు ఎవ్వరి బాధ మనకుండదు



తెలుగు సానెట్లు-4

# గాలి జాలి

అడవి చుట్టూ ఓరిమిగా తిరిగీ తిరిగీ
చిట్టడవి లోలోపల ముళ్ళ కంపల్లో దూరీ దూరీ
ఒళ్ళంతా రక్తపు గీరలతో
కాళ్ళ నిండా దుమ్మూ దూమారంతో
నా కోసం పరుగు పరుగున వస్తోందే గాలి?
ఏం తెస్తోందబ్బా? ఇంత చీకటి వేకువనే?
దొంగ తుపాకి తూటాకు నా అప్పు డెవరైనా
నేలకు ఒరిగాడని చెప్పదుకదా?
ఏ కంసుడైనా మ్మరో విప్లవ శిశువును నరికాడనదు కదా?
దుఃఖ గాథలు వినీ వినీ గుండె చెరువై ఉన్నాను ...
ఈ వేకువనైనా నన్ను కనిరించదా గాలి?
దాచదా దయతలచి రవంత కాలం జాలి?
ఒళ్ళంతా నెత్తుటి చారికలున్నా, గాలి
బుగ్గల్లో నవ్వుల సొట్టలు దాచక పోలేదు!

—సోమసుందర్

# కాగితపు పడవలు

పరవాలేదు చెప్పు – నాకు కోపమెందుకు?

ఎన్నాళ్ళిలా దొంగల్లా బ్రతకడం చెప్పు – అందుకే ఇద్దరం యెక్కడకైన పారిపోయి వివాహం చేసుకుందాం

అమ్మోయి! మా నాన్నకి తెలుస్తే నన్ను చంపేస్తాడు మా జయలక్ష్మి అక్కంటే నా కెంతో భయం ఇంట్లోంచి గెంటేస్తుంది

వెర్రిదాన! వాళ్ళు గెంటే ముందరే మనం వెళ్ళిపోతుంటేను, వాళ్ళకా శ్రమ ఉండదుగ

ఏమో బాబు నాకు చాల భయంగ ఉంది

చూడు సుమతి మనిద్దరం ఇలా దూర దూరంగ ఉండడం నీకు ఇష్టంగా ఉందా? మనిద్దరం యెవ్వరి భయం లేకుండ హాయిగ రోజు సినిమా చూసుకుంటు ఇద్దరం ఒకటై కాపురం చేసుకుంటే ఎంత బాగుంటుందో ఆలోచించు

బాగుంటుందే అనుకో – మరి మన పెళ్ళి?'

ఓ అదా నీ జంకు! అన్నవరంలో మా బంధువు లున్నారు వాళ్ళు చాల మంచివాళ్ళు ఇక్కడనుంచి మనిద్దరు వేర్వేరు బస్సులలో విశాఖపట్నం వెళ్దాం అక్కడ నుంచి ట్రెయినులో అన్నవరం వెళ్దాం అక్కడ కోవెలలో దేముడి ముందర మనం పెండ్లి చేసుకుందాం తరువాత కాకినాడ వెళ్ళిపోయి మా పిన్ని ఇంట్లో కాపురం పెడ్దాం మా పిన్నికి పిల్లలు లేరు మొగుడు మా పిన్ని ఎంత చెప్తే అంత వింటాడు మనం నిర్భయంగా హాయిగ కాకినాడలో ఉండొచ్చు

ఉండొచ్చునుకో – మరి డబ్బు సంగతి?

నేను గడిస్తానుగా మా పిన్నికి కాకినాడలో చాలమంది తెలుసు మన రాబడికి లోటుండదు"

సుమతికి ఈ సమాధానం అంత సంతృప్తికరంగ లేదు ఆమె చిన్న బుర్రలో సందేహాలు, మళ్ళీ ఏదో తెలియని ఆకాంక్ష ఆమె మౌనానికి అతడు భయపడిపోయేడు ఎక్కడ తన చేతిలోంచి పిట్ట తప్పించుకుంటుందోనని అందుకేచ్చేటు మార్చేడు, అతడికి తెల్సింది మామూలు మాటలవల్ల తను నెగ్గలేడని, సుమతిని ఆకట్టుకోలేడని అందుకే మానసికంగ ఆమెను లాగాలని యత్నించేడు

సుమతి నాతో లేచిరావా?

నాకు చాల భయంగ వుంది – అంత సాహసం చేయగలనా?

చూడు సుమతి – నేను నిన్ను చాల గాఢంగా ప్రేమిస్తున్నాను నువ్వు లేందే నేను బ్రతకలేను నువ్వుగాని నాతో లేచి వచ్చి నన్ను పెండ్లి చేసుకోకపోతే నేను రైలు క్రింద పడిపోయి చచ్చిపోతాను దెయ్యమై నీ చుట్టు తిరుగుతాను, ఎవ్వరి జంకు లేకుండా అవిధంగనైన నీకు చేరువవుతాను ఇది నిజం తెల్సుకో నువ్వే తేల్చుకో – నా చావు కావాలో, లేక నా పెండ్లి కావాలో

సుమతి చాల భయపడిపోయింది తనవల్ల ఒకడు చావడం అన్నది ఊహించుకోలేకపోతుంది పాపం తనని పట్టుకుంటుంది

అంత పని చేయకు – నన్ను ఆలోచించుకోనియ్యి "

అతడికి తెల్సు అవకాశాన్ని జారవిడుచుకుంటే మరి రాదని

సుమతీ! మనం ఆరు నెలల నుండి ప్రేమించుకుంటున్నామా! ఇంతవరకు నిన్ను తాకడానికి కూడా నాకు అవకాశం లేకపోయిందికదా – నీకోసం నా శరీరం ఎలా కాలిపోతుందో చూడు మరి నే నా బాధను సహించలేను నువ్వు నన్ను పెండ్లి చేసుకోకపోతే నే నిలా కాలిపోవల్సిందే అందుకే నన్ను నమ్మి నాతో వచ్చేయి

సుమతి చలించి పోయింది మెదడు మొద్దుబారింది మళ్ళీ తన యౌవనం పాములా పడగ విప్పింది అతడిలోని కాంక్ష తన కాంక్షను మేల్కొల్పుతుంది

సరే ఎప్పుడు మన ప్రయాణం చెప్పు?

ఎల్లుండి మధ్యాహ్నం మూడు గంటల బస్సులో నువ్వు విశాఖపట్నం వెళ్ళి వాల్తేరు రైల్వే స్టేషనులో పుస్తకాల షాపు వద్ద నిల్చో నేను తరువాత బస్సులో అక్కడికి వస్తాను ఇద్దరం కలసి ట్రెయినులో అన్నవరం వెళ్ళిపోదాం నీ బట్టల్ని చేతి సంచీలో పెట్టుకుని బజారుకు వెళ్తున్నట్లు బయలుదేరు ఉండు నేను పది రూపాయలిస్తాను బస్సు ఖర్చుకు

అఖర్లేదు – బస్సు ఖర్చుకు నా దగ్గర డబ్బుంది

అసలు సంగతి సుమతి దగ్గర పావలా కూడ లేదు వాళ్ళ పెద్దక్క కమలమ్మ పెట్టిలో రెండు వందల రూపాయ లున్నాయి మూడు రోజు క్రిందటే ఆమె మడితో ఉన్నప్పుడు తన అన్న కృష్ణకు పెట్టిలోంచి తీసి ఓ పది రూపాయ లివ్వమంది తను చీర మడతలోంచి తీసి ఇచ్చింది ఆ రెండు వందలు తను తీసుకునిపోతే తనకు కాపుగ ఉంటుంది ఈ ఆలోచనతోనే సుమతి డబ్బును వద్దంది

"సరే – నీ దగ్గరున్న డబ్బంత తెచ్చుకో మరి ఒట్టు వెయ్యి ఎల్లుండి తప్పకుండ నువ్వు నాతో లేచి వస్తావని "

ఒట్టు " సుమతి చేతిలో చెయ్యి వేసింది

ఆ ఎల్లుండి వచ్చింది సుమతి గుండెలు విపరీతంగ కొట్టుకుంటున్నాయి తను ఏం చేస్తున్నది ఏమీ తోచడం లేదు

ఏమే సుమతి ఏమిటా తిండి? కోడిలా కెలుకుతునావే గాని అన్నం తినడం లేదేమి?"

అబ్బే ఏమీ లేదు – ఆకలిగా లేదక్కా "

"ఏం? ప్రొద్దున్న ఏమైన తిన్నావా?

'ఏం లేదే "

బాగుంది – నీ వరస"

కమలమ్మకు అంతు చిక్కడంలేదు సుమతి బెదరు గాభరా కమలమ్మ పొద్దున్న స్నానంకు వెళ్ళినప్పుడే సుమతి ఆమె పెట్టెలో ని రెండు వందల ఇరవై రూపాయలు తీసి తన రవికలో పెట్టుకుంది తరువాత కమలమ్మ పన్నెండు గంటలకు భోజనం చేస్తున్నప్పుడు ప్లాస్టిక్ సంచీలో తన నాలుగు పరికిణీలు నాలుగు వోణీలు, రవికలు పెట్టుకుంది ఓ తువ్వాలుతో ఆ సంచీని ముందు గదిలో కుర్చీ వెనకాతల దాచింది ఆసరికి తండ్రి వాలు కుర్చీలో నిద్ర పోతున్నాడు

ఈ పనులన్ని చాల యాంత్రికంగ చేసుకు పోయింది తను ఏం చేస్తున్నది, తప్పా ఒప్పా అని చర్చించుకునే స్థితిలో లేదు సుమతి ఏదో మంత్ర ముగ్ధలా చేసుకు పోతూంది' సుమతికి ఒకటే తెల్సు – భవిష్యత్తు, అతడితో కలయిక బహు రమ్యంగా ఉంటుందని తన స్నేహితురాలు రజని మొదటిసారి అత్త వారింటినుండి పుట్టింటికి కొత్తవలస వచ్చినప్పుడు భర్తతో తన కాపురం, పడకటింటి తమ ముచ్చట చాల మధురంగ చిత్రించి చెప్పింది ఆ అనుభూతి కోసం సుమతి కాస్త తహతహ లాడుతుంది

సుమతిది ఎదిగి ఎదగని మనస్సు మెదడు నిశితంగలేదు మంచి చెడ్డలు తెల్లియని స్థితిలోనిది అందుకే రెండు గంటలన్నరకు ఎంతో భయంతో గదిలో నున్న వెంకటేశ్వరుని పటానికి దండం పెట్టి, తండ్రి కాఫీ త్రాగడానికి వంట గదిలోనికి వెళ్ళగానే ముందు గదిలోని సంచీ తీసుకుని బజారుకు బయలు దేరింది

పది నిముషాల తరువాత కమలమ్మ కేక వేసింది

సుమతీ' మురళి ఏడీ – కాఫీకి పిలు

గదిలో నుంచి జవాబు రాలేదు

సుమతి ఏది చెప్మా – ఇది ఎక్కడికేనా పోయిందేమిటి?

పోతుంది – దానికి మరి పనేమిటి నేను మురళిని పిలుచుకుని వస్తానుండు , అని కుటుంబరావు గదిలోంచి ముందు వసారాలోకి వచ్చేడు ఇల్లంత చూచేడు మురళిగాని, సుమతిగాని ఎక్కడ కనిపించలేదు

కమలా' సుమతి గదిలో లేదే – ఆ శకుంతలింటికి పోయుంటుంది నువ్వు దానికి ఎందుకు చెప్పవు శకుంతల ఇంటికి మాటికి చీటికి పోవద్దని? ఆ జగ్గారావు జలాయి వెధవని నీకు తెలియదు

చెప్తూనే ఉన్నాను నాన్నా' గాని అది దొంగయి పోయింది ఎప్పుడు వెళ్తుందో తెలియటంలేదు ఈమారు గట్టిగ గదమా యిస్తానులే కాఫీ త్రాగకుండ ఈ మురళిగాడు కూడ వెళ్ళిపోయేడు చూడు

బహుశా ఏదైన పని పెట్టుకుని వాళ్ళిద్దరు బజారుకు పోయేరేమొ

ఏమో'

అర గంట గడిచింది మురళి వచ్చేడు

'ఏమిరా కాఫీ కూడ త్రాగకుండ ఏమి రాచకార్యాలు మించిపోయాయని వీధిలోకి పోయేవు?

అది కాదు తాతా – నా స్నేహితుడు సుందరం లెక్కల పుస్తకం ఇస్తానంటే వాళ్ళింటికి వెళ్ళేను చూడు – ఈ పుస్తకం తెచ్చుకున్నాను

సరే వంటింట్లోకి వెళ్ళు – మీ అమ్మ నువ్వు కాఫీ త్రాగలేదని కేక వేస్తుంది– త్వరగపో

మురళి వంట గదిలో కాఫీ త్రాగుతు కమలమ్మ ముఖంలోకి చూచేడు

అమ్మా! సుమతి పిన్ని ఎక్కడికి వెళ్తుందే?

ఏం – నువ్వెక్కడ చూసేవు?"

నా స్నేహితుడి ఇల్లు రైల్వే స్టేషను దగ్గరుంది వాడింటినుంచి నేను వస్తుంటే విశాఖపట్నం బస్సు వెళ్తుంది అందులో కిటికీ దగ్గర సుమతి పిన్నిను చూచేను

సుమతి ప్రక్కన ఎవరున్నారురా?

ఎవరో మరొకామె ఉంది నేను పిలిచి అడుగుదామంటే బస్సు వేగంగా పోతూంది

# కాగితపు పడవలు

నువ్వు ఎవర్ని చూసి ఎవరనుకున్నావో!

లేదమ్మా – సుమతి పిన్నిని నేను సరిగ్గాచూచేనమ్మా

అయితే సుమతి విశాఖ బస్సు ఎందుకు ఎక్కింది చెప్మా!

కమలమ్మ మనస్సు చెదరింది ఆ విషయం గురించే ఆలోచిస్తుంటే మనస్సులో ఓ బెదరు కల్గింది మరి ఉండబట్టలేక ముందు వసారాలోకి వచ్చి తండ్రితో మాట్లాడింది

నాన్నా! నువ్వొకసారి శకుంతలత్త ఇంటికి వెళ్ళాలి

ఎందుకు? కుటుంబరావు ఆశ్చర్య పోయేడు

ఆ జగ్గారావు ఇంట్లో ఉన్నాడో లేడో – లేకపోతే ఎక్కడికి వెళ్ళేడో కనుక్కునిరా మన సుమతి వాళ్ళింట్లో ఉందో లేదో చూడు

కుటుంబరావు నిశితంగా కూతురి ముఖంలోకి చూచేడు మెల్లగ ఆతడికి అనుమానం కల్గ జొచ్చింది

ఏమే – ఏముయింది? కొంపతీసి

గట్టిగా మాట్లాడకు నాన్నా ఎవరైన వినగలరు

అయితే ఏమయిందో చెప్పు?

నా మాట విను నాన్నా – నువ్వు త్వరగా వెళ్ళి సుమతి శకుంతలత్త ఇంటికి వచ్చిందో లేదో కనుక్కో – అలాగే జగ్గారావు గురించి

నాకు తెలుసు ఈ పాడు ముండ ఏ నాటికేనా కొంప ముంచుతుందని తిట్టుకుంటు పై మీద కండువా వేసుకుని త్వరగా శకుంతల ఇంటికి వెళ్ళేడు

ఇంట్లో శకుంతల, ఆవిడ కూతురు ఉన్నారు

ఇవాళ మా యింటికి సుమతి రాలేదన్నగారు

పోనీ మీ అబ్బాయి జగ్గారావు ఉన్నాడా – వాడితో చిన్న పనుంది

వాడేదో పనుందని విశాఖపట్నం వెళ్ళేడు

ఎప్పుడొస్తాడు?

వాడి సంగతి మీకు తెలియందేముంది అన్నగారు వెళుతున్నప్పుడు వాడు బాగ్ తీసుకుని వెళ్ళేడు రేపో, ఎల్లుండో ఎప్పుడు వాడి కిష్టమైతే అప్పుడు తిరిగి వస్తాడు

కుటుంబరావు హృదయం బారమైంది జరగకూడనిది జరిగి పోయింది ఒక్కసారి శకుంతలమీద ఆవిడ సుపుత్రుడిమీద మిక్కుటమైన కోపం వచ్చింది ఏమోమో అందామనుకున్నాడు, గాని అంతలోనే వివేకం మేల్కొనడంవల్ల కోపాన్ని దిగమ్రింగి నీరసంగ ఇంటికి తిరిగి వచ్చేడు

కనుక్కున్నావా నాన్నా?

అమ్మా – అంతా అయిపోయింది! మనం బయపడింది జరిగి పోయింది జగ్గారావు లేడు, సుమతి లేదు ఇంతకీ నీ కెలా సందేహం కల్గింది?

మన మురళి అలా వస్తున్నప్పుడు విశాఖ వెళ్ళే బస్సులో మన సుమతి అగుపించిందట పిలుద్దామనుకుంటే బస్సు త్వరగా పోతోందట

పాడు ముండ ఎంత పని చేసింది! చూడు నీ నగలుగాని డబ్బుగాని తీసుకుని పోయిందేమో

చటుక్కున కమలమ్మ గదిలోకి పోయి తన పెట్టి తెరిచింది అడుగున పెట్టిన నగల పెట్టె అలాగే ఉంది నగలతో – గాని చీర మడతల్లో పెట్టిన డబ్బు పోయింది ఆ విషయాన్నే తిరిగి వచ్చి తండ్రితో చెప్పింది

నాన్నా! త్వరగా నువ్వు బస్సులో విశాఖపట్నం వెళ్ళు నాన్నా దాన్ని వెదకి తెచ్చువుగాని నాకు చాల భయంగా ఉంది నాన్నా

"విశాఖపట్నంలో ఎక్కడని వెదక మన్నావు – పోనీ పాడు ముండ, ఈవిధంగా పీడ విరగడైంది

(ఇంకా ఉంది)

**కె. ఆర్. – తలుపుల**

ఒంటివాడు ఇల్లూ వాకిలీ లేనివాడు, భిక్షా పాత్ర పట్టిన వాడూ, దిగంబరుడూ సహితం దురాశకు గురి అవుతాడు అంటారుం నిజమేనా?

★ నిజమే- పైవేవీ "కోరిక"కి అడ్డు రావు కావు

**బి. ఎస్. ఆర్. – ఖమ్మం**

గ్రామోదయ పథకంపై మీ అభిప్రాయం ఏమిటి?

★ నిజానికి నా కదో పట్టాన అర్థం కావడం లేదు ప్రతి వూళ్ళో కావలసిన పార్టీ యువతకి అండగా వుండడానికా? ఎవ-రైనా – నిలదొక్కుకోవాలంటే – సహాయకారిగా వుండడానికా? మన సమా-చార ప్రచార శాఖ వారి కర పత్రాల భాష – మరీ "పౌరాణికం" పోయి – అసలు విషయం మామూలు వారి కర్థం కాడం లేదు

**ఎల్. వి. సి. హెచ్. ఆర్. – పెదరావూరు**

మనిషి జీవితంలో మధురమైన క్షణాలు అంటే ఏమి?

★ విన సొంపుగా తన గొంతు వింటూ వుండడం, తనని విన సొంపుగా అంతా పొగుడుతూంటే వింటూండడం – కావా?!

**ఎ. ఎస్. కె. – గుంటూరు**

మీరు తెలుగు వారై వుండి మద్రాసులో వుండుటకు కారణం?

★ మాలా చాలా మందే యిక్కడ వున్నారని మీకు తెలియదా?!

**ఎ. ఆర్. – కొమరగిరిపట్నం**

నా స్నేహితులు నేను ఖైయిదీ అని వ్రాయడం తప్పు ఖైదీ అని వ్రాయాలని అంటున్నారు ఏది రైటు?

★ భాషకి- అర్థం కావడం ప్రధానం- ఎలా రాసినా ఫరవాలేదు ఛాందసులు యింకా ఖైదీ అంటే మామూలు వాళ్ళు ఖయిదీ అని అంటున్నారు లినో మిషను-కిదే సులభం




**సిద్ధినేని, గుడివాడ**

సాంబారు తాగుతూ మీరు గోంగూరకు చేసే సేవకు జేజేలు చెప్పమంటారా! జోహార్లు పలకనా

★ నాకు సాంబారు తాగేలాంటి అనాగరిక లక్షణాలులేవు! గోంగూరకు నే చేసే సేవాలేదు– అది నాకు సయించదు అంచేత– మీ జేజేలూ ఆంధ్రా లీడర్లకి అట్టే పెట్టండి!

మంచి సమయం, మించి పోవును. త్వరపడండి కె రా గారూ నాలాంటి అల్లుడు దొరకడం కష్టం

★ మరేం ఫరవాలేదయ్యా సిద్దీ! నేనలా ఖంగారుగా అల్లుళ్ళను నిర్ణయం చేయను!!

**టి.కె.ఆర్. – మహాదేవిపురం**

రెండు నిముషాలే మౌనంపాటిస్తా రెందుకు సభల్లో? అసలు మౌనం ఎందుకు పాటించాలి?

★ ఆ రెండు నిముషాలు సైలెంటుగా వుండడానికే ఎంత ఇబ్బంది పడతారో-- కొందరు–చూశారా ఎప్పుడైనా?! పోయిన వారిపై గౌరవ ప్రదర్శనకి ఆ మౌనం పాటించడం

**ఎమ్.ఎమ్.బి. – ఏలూరు**

విడదీయలేని ప్రేమబంధానికి రక్త సంబంధం అడ్డువస్తే ఏం చేయాలి?

★ మీ ఊళ్ళో తూర్పు ఎటు?!

**జి.ఆర్. – సాలూరు**

రామలక్ష్మిగారికి, నావి విప్లవ భావాలు, అందుకే రెడ్ ఇంకుతో రాస్తున్నాను నన్ను ఒక అమ్మాయి ప్రేమిస్తోంది కాని యింటి దగ్గర యిష్టంలేదు

★ అయితే యింకేం? ఇంకు రంగు-మార్చు, నీళ్ల మీద రాత ప్రారంభించు

**ఎన్.ఆర్. - భట్టిప్రోలు**

మనిషి ఆశకు అంతెక్కడ?

★ లేదు

**సి.ఆర్. – అనంతపురం**

ఛస్తే బ్రతికేది ఎవరు?

★ కీర్తి

**వి.ఎస్.ఆర్. – హైదరాబాద్**

కట్నం తీసుకోమంటారా!

★ సిగ్గు లేక పోతే – తప్పులేదు తీసు-కోండి ☐



# అవిటి ప్రాణి

"మమ్మీ! తొందరగా రావాలి దొడ్లోంచి గట్టిగా పిల్చాడు మురళి

ఏమిట్రా? ఇంట్లోంచే బిగ్గరగా అంది వాసంతి

ఓసారిలా రామ్మా! వాడి గొంతులో కంగారు!

ఎలా రాన్రా? వాసంతి గొంతు సన్నగా వణికింది

అప్పుడు గుర్తొచ్చింది మురళికి తల్లి లేవలేదని గభాల్న తల్లి దగ్గరి కొచ్చి –

సారీ మమ్మీ! మర్చిపోయి పిల్చాను అన్నాడు మురళి నొచ్చుకుంటూ

పరవాలేదులే! ఏమిటి ఎందుకు పిల్చావ్? నవ్వు తెచ్చుకుంటూ అంది వాసంతి

మరేం లేదమ్మా! .. కాకి కాలుకి దెబ్బ తగిలినట్టుంది పాపం! కుంటుకుంటూ మెతుకుల్ని ఏరుకు తింటోంది! జాలిగా అన్నాడు మురళి

తృళ్లిపడింది వాసంతి

అయ్యో! ఎలా తగిలిందిరా? అంది ఆదుర్దాగా

ఏమో నమ్మా! తెలియదు! ఎవరైనా కొట్టారేమో!

బాగా తగిలిందా? నెత్తురొస్తోందా? కంగారుగా అంది వాసంతి

ఆ! తగిలినట్టే వుంది! అసలు కాలుకింద పెట్టలేక పోతోంది

అయ్యో! అంటూ ఆ దెబ్బ తనకే తగిలినట్టు తెగబాధపడి పోయింది వాసంతి

అదే మరొకప్పుడైతే ఈ విషయాన్ని తేలిగ్గా తీసి పారేసేది కానీ ఇప్పుడామె అలా అనుకోలేదు కారణం

రెండు నెలల క్రితం ఆమె మేడ ఎక్కుతూ కాలు స్లిప్పయి పడిపోయింది

కాలు ప్రాక్చరయింది!

అప్పట్నించీ పిండి కట్టుతో అలా మంచంమీదే వుండిపోయింది

మానసికంగా చాలా కృంగిపోయింది

మంచంలో ఉన్న ఆమెకి ఆలోచనలు ముసిరి తెగ భయ పెట్టేశాయి

మనిషి నిస్సహాయ స్థితిలో ఎలా వుంటాడో అనుబవ పూర్వకంగా తెలుసుకుంది

అందుకే ఏ ప్రాణి బాధపడుతున్నా ఆమె చూడలేదు చూచి బరించలేదు

అందుకే కాకి సంగతి వినగానే గిలగిల్లాడిపోయింది

కాకిని గురించి పదే పదే అడిగింది కొడుకుని

బర్త, పిల్లలు ఆమెని ఎంతో అపురూపంగా చూసుకుంటున్నా మంచంలో వుండటం నరక ప్రాయంగానే వుందామెకి

మరో నాలుగు రోజుల్లో కట్టు విప్పుతానన్నారు డాక్టర్‌గారు

ఆ నాలుగు రోజులూ మరీ యుగాలుగా తోచాయి వాసంతికి ఒక్కసారి కాకిని చూడాలని మహా ఆరాటంగా వుందామెకి

అనుకన్న రోజునే వాసంతి కాలు కట్టు విప్పారు

పసిపాపకి నడక నేర్పుతూ, ఆ పాప మెల్లగా అడుగులేస్తూంటే మురిసిపోతూ చూసే తల్లిలా చూస్తున్నారామెకేసి బర్త, పిల్లలు

తల మీదినించి పదిటన్నుల బరువు దించినట్లయింది వాసంతికి

ఆ వెంటనే కాకిని చూసింది!

ఆ కాకికాలు దాదాపు శిదిలావస్థలో వుంది!

ఏం జబ్బో! లేకపోతే ఏ తుంటరి వెదవో రాయిపెట్టి కొట్టి వుంటాడు! అది సెప్టిక్ అయి వుంటుంది! అయితే పాపం దానికి కట్టెవరు 'డతారు? అసలు వాటిలో డాక్టర్లుంటారా? తన ప సి ఆలోచనలకి తనే నవ్వుకుంది వాసంతి

మర్నాడు కాకికాలు మరీ పాడైపోయింది బాదవల్ల కాబోలు ఓ మూల ఒదిగొదిగి నిల్చుంది

క్రమేపీ దానికాలు క్షీణించి ఓ రోజున పూర్తిగా ఊడిపోయింది

ఓ కాలులేని, బాధతో మూగగా రోదిస్తూ ఓ పక్క గా ముడుచుక్కూర్చున్న ఆకాకిని చూసి తల్లడిల్లిపోయింది వాసంతి

కానీ తానేం చెయ్యగలదు? బాద తగ్గింది కాబోలు మరో రోజు తర్వాత మెల్లగా మెతుకులు ఏరుకు తినడానికి ప్రయత్నించింది ఆ కాకి కాని మిగతా కాకులు దాన్ని చేరనివ్వలేదు

అలాగే పనిమనిషి పడేసిన అంట్లలోని మెతుకులు ఏరుకు తింటూ, మిగతా కాకులు తరుముతూంటే, భయంతో పక్కకి తప్పుకుంటూ దూరంనించే ఆ మెతుకులకేసి ఆశగా చూస్తూ ఒదిగొదిగి వుండే ఆ కాకిని చూస్తూంటే వాసంతి కళ్లు నీళ్లతో నిండిపోయేవి!

ఓ సారి మెల్లగా కాస్త ఇడ్లీ ముక్క తుంచి దానిముందు పడేసింది వాసంతి

ఆకలితో, ఆనందంగా అందుకోబోయిన ఆ కుంటి కాకిని తరిమేసి మరో కాకి దాన్ని నోట కరుచుకు పోయింది

ఎవరో, ఎప్పుడో కులాభిమానం వున్న వాళ్లని కాకులతో పోల్చడం గురించి అందులో ఎంత నిజం వుందో చూసి మరీ తెలుసుకుంది వాసంతి

అంతా అబద్ధం!

మనిషికి ధనమె కొండంత బలం! కానీ జంతువులకీ ఇలాంటి ప్రాణులకీ శారీరక బలమే ముఖ్యం!

బలవంతులదే రాజ్యం!

బారంగా నిట్టూర్చింది వాసంతి

ఆ రోజునుంచీ కాకి ఒంటరిగా ఉన్న సమయం చూస జాగ్రత్తగా ఆహారం వెయ్యడం మొదలు పెట్టింది

కొన్నాళ్ళకి ఆ కాకికి కాస్త ధైర్యం వచ్చినట్టుంది నిర్భయంగా లోపలికి రావడం ప్రారంభించింది

అంతేకాదు కుంటికాలి మీద ఆమెకున్న అబిమానం మిగతావి కనిపెట్టినట్టున్నాయి అవి కూడా ఆ కుంటికాకిని అంటిపెట్టుకుని మరీ వుండడం మొదలు పెట్టాయి!

అయినా ఎలాగో తెలివిగా ఆ కుంటికాక్కి మాత్రమే ఆహారం వేస్తూ దాన్ని బ్రతికిస్తోంది వాసంతి

అనుకోకుండా ఊరెళ్లిన వాసంతి పదిరోజుల తర్వాత తిరిగి వచ్చింది

హటాత్తుగా ఆమెకి కాకి గుర్తొచ్చింది! గుండె ఝల్లుమంది!

కంగారుగా పెరడంతా వెతికింది!

ఆ కాకి కనిపించలేదు!

ఏమైంది? ఈ పది రోజులూ దానికి తిండెలా దొరికింది? ఎవరు పెడతారు ఒక వేళ తిండిలేక అమ్మో! అలా వూహిస్తేనే ఆమె మనసంతా అదోలా అయిపోయింది

తను కనిపించగానే ఒంటికాలితో కుంటుకుంటూ దగ్గరకు వచ్చే ఆ కాకి కనిపించక పోయేసరికి వాసంతికి పిచ్చి పట్టినట్టుగా అయిపోయింది

మంగీ! ఆ కాకిని చూశావుటే? అంది పని మనిషితో

లేదమ్మా! ముబావంగా అనేసి చీపురు చేతిలోకి తీసుకుని ఊడవడం మొదలు పెట్టింది మంగి

ఏమైందో ఏమిటో! కాస్త మేంలేని ఈ నాలుగురోజులు దానిక్కాస్త తిండి పడెయ్య కూడదుటే? అంటూ విసుక్కుంది వాసంతి

నేనూ పన్లోకి రానేదమ్మా!

ఏమిటే నువ్వూ రాలేదా? అంటే మేం లేనన్నాళ్ళూ వీధిలో ముగ్గెయ్యలేదా? కోపంగా అంది వాసంతి

మంగి మాట్లాడలేదు

ఎంత నిర్లక్ష్యం! అడిగేది నిన్నేనే! కాకి కనిపించలేదన్న కోపం మంగి మీద చూపించింది వాసంతి

మొన్న మనం వెళ్లే రోజు మంగికి జ్వరంగా వుంది కదమ్మా! ఎక్కువైందేమో! అన్నాడు మురళి

వాసంతి పరీక్షగా చూసింది మంగికేసి

నిజంగా మంగి నీరసించి వాయి వుంది క్షణం జాలివడింది కానీ బింకంగా

ఊ! ఎప్పుడూ రోగాలే! అదేమంటే మావీ ప్రాణాలే అంటూ వెధవ సినిమా డైలాగులు! రుస రుసలాడుతూ అంట్లు పడేసింది

మంగి మౌనంగా అంట్లు ముందు కూర్చుని తోవడం మొదలుపెట్టింది

ఇంతలో పక్క తోటలో బోలెడు కాకులు గోలగా అరవడం వినిపించింది

వాసంతి తృళ్ళి పడింది

మంగీ అక్కడేదో కాకులరుస్తున్నట్టున్నాయి చూడు అంది కంగారుగా

మంగి లేచి వెళ్ళింది

ఇంతలో పక్కింటి పాప పరుగెత్తుకొచ్చింది ఆంటీ! మా దొడ్లో ఓ కాకి చచ్చిపోయింది 'పాపం' దాని చుట్టాలు కాబోలు తెగ ఏడుస్తున్నాయి! అంటూ

వాసంతి గుండె జల్లుమంది

పుట్టెడు దు ఖం ముంచుకొచ్చింది!

అవును! మరి! ఇన్నాళ్ళు తిండిలేక పోతే ఎలా బతుకుతుంది? పాపిష్టి దాన్ని ఎవరికైనా చెప్పినా వెళ్ళాను కాదు నాలుగు మెతుకులు పడెయ్యమని!

అయినా ఆ వెధవ కాకులు మాత్రం? బతికున్నన్నాళ్ళు దాన్ని ఒంటరిదాన్ని చేసి దూరంగా తరిమేశాయ్! ఇప్పుడు ఏడుస్తున్నాయి!'

తనని, కాకుల్ని కూడా తిడుతూ అలా నిల్చుండి పోయింది వాసంతి

ఏమిటి వసూ! ఇక్కడ నిల్చున్నా వేమిటి? నీ కాకి ఫ్రెండ్ కనిపించలేదా? అంటూ ఆమె భర్త రామం వచ్చాడు

భర్త మాటలకి మరీ దు ఖం పెరిగి ఒక్కసారి చేతుల్లో ముఖాన్ని దాచుకుని భోరుమంది వాసంతి

ఏమిటి? ఏమైంది? కంగారుపడి పోయాడు రామం

మన మన కుంటి కాకి చచ్చి పోయిందండీ! ఏడుస్తూనే అంది వాసంతి

ఓస్! దానికేనా? నే నింకేదో అనుకుని కంగారు పడ్డాను! తేలిగ్గా అనేశాడు రామం అతని మాటలకి తెల్లబో యిన వాసంతి కోపంగా ఏదో అనబో యింది ఇంతలో –

కావ్! కావ్! అన్న సుపరిచిత స్వరం వినిపించి తృళ్ళి పడి చూసింది

అవును! ఆ కాకే!

తను ప్రేమించే ఆ కుంటి కాకే!

వాసంతి ముఖంలో చెప్పలేనంత వెలుగు!

ఆమెకి ఆ కాకి అరుపు తియ్యని వేణు నాదంలా తోచింది!

అబ్బ నన్ను చూసిన దాని ముఖంలో ఎంత ఆనందం! అనుకుని మురిసి పోయింది!

ఏమండీ! ఆ చచ్చి పోయింది మనకాకి కాదు!అదేదో వేరే కాకి! ఆ ఆనందంతో భర్త మీది కోపంగానీ, ఆ కాకిని భర్త కూడా చూస్తూన్నాడనిగానీ గుర్తు రాలేదు వాసంతికి

గబ గబా లోపలికెళ్ళి తినడానికేదో తెచ్చి దాని ముందు పడేసి. అది కుంటుతూ ఏరుకుని తింటూంటే. మిగతా కాకులు రాకుండా చూస్తూ అద్భోలాంటి తన్మయావస్థలో పడిపోయింది!

ఆమె చర్యని జాగ్రత్తగా గమనిస్తున్న రామం వసూ! ఒక్క మాటడుగుతాను! కోపం తెచ్చుకోవుగా? అన్నాడు మెల్లగా

ఊహూ! అడగండి! నవ్వుతూ అంది వాసంతి

ఈ కుంటి కాకి మీద నీ కెందుకింత మమకారం?

బావుంది! ఇదో ప్రశ్న? అడిగారు కాబట్టి చెప్తున్నాను! పాపం! అది కుంటి కాకి! తనంతట తానుగా తిండి సంపాయించుకోలేదు! అందుకే నాలుగు మెతుకులు వేస్తూన్నాను అవి తిని అది బ్రతుకుతోంది! తేలిగ్గా అంది వాసంతి

ఆ కుంటి కాలితో అది బ్రతికి ప్రయోజనం ఏమిటి? అలా బ్రతికి ఎవర్ని వుద్ధరించాలి? ఇలాంటి అవిటి జీవాలు బతికేకంటే చస్తే సుఖం కదూ? అన్నాడు రామం

నిర్ఘాంత పోయింది వాసంతి

మీరనేది తడారిన గొంతుతో ఏదో అనబోయింది

"అయాం సారీ! ఏది మాట్లాడినా కాస్త దూరం ఆలోచించి మాట్లాడాలి వాసంతీ!

మెల్లగా అనేసి లోనికెళ్ళిపోయాడు రామం

వాసంతి ముఖం కత్తివేటుకు నెత్తురు బొట్టు లేనంతగా పాలిపోయింది!

గతం ఆమె కళ్ళ ముందు వికటాట్టహాసం చేసింది

***

మంగికి మూడేళ్ళ క్రితం ఓ కొడుకు పుట్టాడు






వాడికి పుట్టుకతోనే రెండు కాళ్ళూ వ్రేలాడిపోయాయి ఇప్పటికీ నెలల పిల్లాడిలానే ఎప్పుడూ పడుకునే వుంటాడు ఎదుగు, బొదుగు లేదు

వాణ్ని చూసిన వాసంతి ఒళ్ళు జలదరించింది

మొదట్లో మంగి వాణ్ని కూడా తనతో తెచ్చుకుని ఓ మూలగా పడుకోపెట్టి తన పన్లు చేసుకుని మళ్ళీ వెళ్ళేటప్పుడు తీసుకు పోయేది

పైగా వాడి కెప్పుడూ రోగాలే!

వాడు పుట్టిందగ్గర్నించీ మంగికి కష్టాలే!

ఒకచోట స్థిరంగా పని చేసుకోనిచ్చేవాడుకాదు తల్లి కనుమరుగైతే రాగం మొదలు పెట్టేవాడు

ఇదంతా మొదట్లో సహించినా రానురాను వాసంతికి చిరాకు ఎక్కువైపోతోంది!

వాణ్ని చూస్తేనే కంపరంగా వుందామెకి

కారణం వాడి మూలంగా మంగి నాగాలు పెడుతోంది!

అంట్లు సరిగ్గా తోమడమే లేదు! బట్టలు సరేసరి! వచ్చిందగ్గర్నించీ 'ఉరుకులు'

మధ్య మధ్య ఆ కుంటి కొడుకుతో ముచ్చట్లు! ఇవన్నీ సహించలేకపోయింది వాసంతి

మంగిని అనవసరంగా తిట్టడం, కొడుకుని ముద్దు పెట్టుకుంటున్న మంగిని చూసి అసహ్యించుకోవడం మొదలు పెట్టింది

మంగి అర్థం చేసుకుంది యజమానురాల్ని అందుకే పసివాణ్ని ఇంటి దగ్గరే వుంచి ఇరుగమ్మ పొరుగమ్మతో చెప్పి పనిచేసుకుని వెళ్లడం మొదలు పెట్టింది

అయితే ఇది మరీ చిరాగ్గా వుంది వాసంతికి

వచ్చిందగ్గర్నించీ వెడతానన్న హడావిడి ఎక్కువైపోయిందని విసుక్కుంది!

అన్నంగిన్నెల్నిండా మెతుకులే! అని మండి పడింది!

ఎక్కడ పొచి అక్కడే! ఇదేం ఊడ్పు అంటూ నిలదీసింది!

అలా పరుగుపెడితే మరో మనిషిని చూసుకోవాల్సొస్తుంది! అంటూ హెచ్చరించింది

## అవిటి ప్రాణి

భర్త ఏదో అనబోతే –

"పనిమనిషి విషయంలో అసహ్యంగా మీరు. తల దూర్చకండి" అంటూ మండిపడింది.

అయితే ఎన్నిచేసినా మంగిని మాత్రం పని మాన్పించలేదు.

ఆమెకి తెలుసు ఈ రోజుల్లో పనిమనుషులెలా వున్నారో.

దొంగతనంలేని, మాట దరుసుతనంలేని మంగిని ఒదులుకునేంతటి పిచ్చిదికాదు వాసంతి.

ఈమధ్య మంగి మరీ నాగాలు పెట్టేస్తోంది.

### వీడ్కోలు

ఏలికవై- మానవతా
మాలికవై- భారతయువ మణి విప విశా
లాలోల కాంతి శిఖవై
కూలితివా? యింధిరమ్మ! క్రూరతకెరవై
గౌరీశిఖర మొరిగెనా? తు
షార ధరాధరము క్రుంగి సమసెనదొ? ఓ
భారత రమణి శిరస్సుం
దారమ! నీవు మము వీడి దూరము చనగన్
దీనులకిక దిక్కెవ్వరు?
మానవతీ! నిన్ను వీడి మాతృరహిత సం
తానమున కుములు జనతా
మ్లాన హృదయ రోదనమ్ము నిందిర వింటే?
కంటికి కడవెడు కన్నీ
రింటికి చనరాని మనసు. హృదయద్వారం
బంటిన వేదన, మేమిడు
చుంటిమి వీడ్కోలిదె కవోష్ణాశ్రువులన్

–మొవ్వ వృషాద్రిపతి

అదేమంటే ప్రాణం బాగాలేదు అంటుంది

ఎక్కడలేని డబ్బు ఆ కుంటి కొడుక్కి మందు లిప్పించడానికే చాలదు! అని విసుక్కుంది ఓసారి మంగి డబ్బడిగితే?

మరోసారి ఎవరో స్పెషలిస్టు వచ్చాడంటూ పట్టాలు తాకట్టు పెట్టి కొడుకును తీసుకెళ్తున్న మంగిని మందలించింది వాసంతి –

ఎందుకే మంగీ! ఈ వెధవకోసం నెత్తురొడ్డి సంపాదించిన డబ్బు ఇలా తగలేస్తావ్? ఏనాటికైనా వీడు బాగుపడతాడా? కాళ్ళు ఇంక రావని హాస్పటల్లో చెప్పనే చెప్పారాయె! ఇలాంటి వాళ్ళు బ్రతికి ఎవర్ని వుద్ధరించాలి! బతికున్న వాళ్లని చంపడానిక్కాకపోతే! అనేసింది అది మంగి మీద జాలో లేక తన పన్లకి ఇబ్బంది రావడంవల్ల కలిగిన చిరాకో సరిగ్గా చెప్పడం కష్టం

ఆమె మాటలకి మంగి ఇంట్లోంచి వస్తున్న రామం కూడా తెల్లబోయారు

ఏం చేస్తాం అమ్మగోరూ! బతికున్నాక సూడక, మందిప్పించక తప్పదుగందా! అంటూ వెళ్ళిపోయింది మంగి

అప్పుడుగానీ తనన్నమాట ఎంత కఠినంగా ఉందో అర్థంకాలేదు వాసంతికి

"దానికి తోడు రామం కూడా వసూ! నువ్వు ఒకోసారి మనుషులు ఎంత హర్ట్ అయ్యేలా మాట్లాడతావో గదిలో ఒంటరిగా కూర్చుని ఆలోచించు! మంగి నీ పనిమనిషేగానీ నీ బానిసకాదు! నువ్వసహ్యించుకునే పసివాడికి కన్నతల్లి! ఆడపుటక పుట్టి, అందునా ఇద్దరు బిడ్డల తల్లివైయ్యుండి నువ్విలా మాట్లాడావంటే నిజంగా నేను సిగ్గుపడుతున్నాను! పదునుగా అనేసి గదిలో కెళ్ళిపోయాడు

వాసంతి మొహం అవమానంతోనూ, సిగ్గుతోనూ కందిపోయింది!

* * *

పర్త మాటతో గతం గుర్తొచ్చిన వాసంతి ముఖం చిన్నబోయింది

## అశ్రుతర్పణం

కంచే
చేను మేసింది!
వీర కృపాణం
పిరికి పందలా
క్రూర హత్య గావించింది!
"మతోన్మాదపు
తుపాకీ గుళ్ళకు
మానవత్వం
బలయిపోయింది!!
ఇంతేనా
మన చరిత్ర గతి!?
ఇదేనా
మనం సాధించిన
ప్రగతి!!?

–"సింహం"



"ఇందిరాప్రియదర్శిని"
చిత్రం : డా. కె. దశరథరామ్, విజయనగరం

## ధృవ తార రాలిపోయింది!

ఇందిర కాదు ఒక వ్యక్తి
ఆమె ఒక మహా శక్తి
పేదల పాలిట పెన్నిధి
బడుగు వర్గాల నిధి
ప్రపంచంలో ఆమెకు లేదు పోటీ
అసమాన ప్రతిభలో ఆమెకు ఆమే సాటి
ఆమె పదవి ఉన్న నాడు- లేని నాడు
ప్రజలను విడవలేదు ఏనాడు
ప్రజా సంక్షేమమే ధ్యేయంగా
దేశాభివృద్ధి ఆశయంగా
చివరి క్షణం వరకు పని చేసింది
అందరి హృదయాలలో నిలచిపోయింది
అందుకే ఆమె అందరకు 'అమ్మ'
అట్టడుగు వర్గాల వారికి ఆశాజ్యోతి 'ఇందిరమ్మ'
మతాంధుల తుపాకీ గుళ్ళకు బలైపోయింది
భారత రాజకీయ ఆకాశంలో ధృవతార రాలిపోయింది

–సురా అప్పారావు

## ఆశాజ్యోతి

బలహీన వర్గాల
ఆశాజ్యోతివి నీవు!
అలీన ఉద్యమ
అధ్యక్షురాలవు నీవు!
ప్రపంచ ప్రఖ్యాత
రాజకీయవేత్తవు నీవు!
ఇరవై సూత్రాల పథకం
ప్రతిపాదకురాలవు నీవు!
డెబ్బై కోట్ల ప్రజానీకానికి
'అమ్మ'వు నీవు!
ప్రజల అభ్యున్నతికోసం
అహర్నిశలు కృషి చేసావు
వారి భవిష్యత్తే
నీ భవిష్యత్‌గా భావించావు
ఇందిరా గాంధీ!
ఎందుకీ లోకం నీవు లేంది?

– నగేష్

## అవిటి ప్రాణి

నిజమే! వెదవ కాకి గురించి తనింత ఆరాటపడిందే కడుపున పుట్టిన బిడ్డను గురించి మంగి అంత ఆరాటపడ్డంతో వింతేముంది?

అసలు తను అంత అసహ్యంగా ఎలా ప్రవర్తించింది? తాను తల్లి అయివుండీ ఓ మాతృ మూర్తి ప్రేమను అంతలా అవమానించిందీ అంటే తననేదో భూతం ఆవహించి వుండాలి!

కానీ ఆ భూతం భర్త ఇప్పుడు వెచ్చరించేదాకా వదిల్లేదా?

కాదు! అహంకారం! 'పనిమనిషి' అన్న చిన్నచూపు! తన పన్లు సవ్యంగా జరగడం లేదన్న చిరాకు!

ఇవన్నీ కలిపి తననో కర్కోటకురాలిగా చేశాయి!

నిజంగా తన ప్రవర్తనకి తాను సిగ్గుపడాలి!

. తల్చుకున్నకొద్దీ వాసంతిలో పశ్చాత్తాపం, మంగి మీద ప్రేమ పెరిగిపోతున్నాయి!

'ఏమైనా సరే! సిగ్గుపడకుండా తాను ప్రవర్తించిన తీరుకు మంగిని క్షమార్పణ అడగాలి!తను దూరం ఆలోచించక అలా ప్రవర్తించిందనీ, ఆ పసి వాడిమీద తనకేమి పగలేదనీ, అవసరం అయితే తానే డబ్బు కర్చుపెట్టి వాణ్ని డాక్టర్‌కి చూపిస్తాననీ మంగికి చెప్పాలి! అనుకున్న తరవాతగానీ వాసంతి మనసు శాంతించలేదు

'అది కుంటికాకి కాదమ్మగోరూ మరేదో కాకి' అని మళ్ళీ అంట్ల ముందు కూర్చుంది మంగి

అవును మంగో! అదిగో ఆ కాకి బతికే వుంది అవును ఇంతసేపేం చేశావ్? అంది వాసంతి నవ్వుతూ

"పక్కింటి అమ్మగోరు మా అబ్బాయి గురించి అడుగుతుంటే

"ఓ! నిజమే మంగీ! వాణ్ని జాగ్రత్తగా చూసుకో! వెధవ అంట్లకేంలే ఎప్పుడూ వుండేవే!కాస్త ఆలస్యంగా వచ్చినా నేనేం అన్ను! అరె!ఏమిటలా చూస్తున్నావ్? నన్ను నమ్మడం లేదు కదూ? సారీ మంగీ' నీ విషయంలో నేను చాలా దారుణంగా ప్రవర్తించాను అందుకు నిజంగా సిగ్గుపడుతున్నాను కానీ మీ వాడిమీద నాకేం పగలేదు మంగీ!" అంది వాసంతి మెల్లగా

మంగి ఓ సారి ఆమెకేసి చూసి భారంగా నిట్టూర్చింది

మంగీ! అయ్యగారికి తెలిసిన బోన్ స్పెషలిస్ట్ ఒకాయన వచ్చారట! ఆయనకి నీకొడుకుని చూపిద్దాం ఏమైనా ఫలితం కనిపిస్తుందేమో! ఉత్సాహంగా అంది వాసంతి

ఇంక ఆ అవసరం నేదమ్మా! మంగిగొంతు ఒణికింది

అదేం? తెల్లబోయింది వాసంతి

'నాబిడ్డ మట్టిలో కల్సిపోయి నా కట్టాలు తప్పించేశాడమ్మా!'

"మంగీ!"

అవునమ్మగారూ! మీ రెల్లిన మర్నాడే అడు సచ్చిపోయాడు! ఇంక ఒక్కనాగా కూడా ఎట్టను!అంట్లు జాగ్రత్తగా తోవుతాను! ఇంటి కెల్లాలని తొందరపడను! అన్నిపన్లూ మీకు నచ్చేలా సేత్తాను!

ఆ బగమంతుడికి నామీద దయ కలిగిందమ్మా! అందుకే అణ్ణొట్టి కెల్లి పోయాడు! నా కింకా అంతా సుకవేనమ్మా! తంవంరన్నట్టు ఆడు సచ్చిపోయి బతికి పోనాడు!"

మోకాళ్ళ మధ్య తల దూర్చుకుని, దుఃఖా న్నాపుకోవాలని ఎంత ప్రయత్నం చేసినా దుఃఖం ఆగక బోరు మంటున్న మంగిని చూసి కొయ్యబారి పోయి ప్రతిమలా నిల్చుండి పోయింది వాసంతి ☐

# నేమ్ బోర్డులు

ARUN
ఎమ్వీఆర్


















# దేదీప్య

## కంచుమర్తి వెంకటేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

"రాఘువ తప్పు చేయడం మానవ సహజం కానీ పశ్చాత్తాప పడడం మంచి మనసున్న మనిషి కర్తవ్యం నీకు నీ గురించి తెలియని వయసులో నీ జీవితంతో ఆటలాడుకున్న పెద్దల పనికి శిక్ష అనుభవించావు నీకు ఏది కాలో తెలుసుకుని దాని కోసం ప్రయత్నించావు అది నీ తప్పుకాదు

నిన్ను ప్రేమించి నీ జీవిత భాగస్వామిగ అందమైన జీవితం అనుభవించాలని కలలు కన్నాను నీ గురించి ఆకాశ హర్మ్యాలు కట్టుతున్నప్పుడు కూడా నువ్వు ఒక్కమాట సరళ గురించి చెప్పలేదు అప్పుడే చెప్పి ఉంటే మంచి స్నేహితురాలిగా నిన్నెప్పుడూ అభిమానించేదాన్ని

నేను అందరిలాగే జీవితంపై ఆశలు పెట్టుకుని కలలు కనే ఆడపిల్లను నిన్ను మనస్ఫూర్తిగ ప్రేమించాను పెళ్ళికి అమ్మా, నాన్న ఒప్పుకున్నప్పుడు నేనెంతో పొంగిపోయాను ఒక్కసారిగ నాకు పెళ్ళయిందని నువ్వు చెప్పగానే ఈ హృదయం ఎంత విలలాడి పోయిందో నీకు తెలుసు

ముందే ఈ విషయం చెప్పకుండా నన్ను మభ్యపెట్టి ప్రేమించినందుకు ఎంత బాధ బడ్డానో నీలో పరివర్తన కలిగి నీ భార్యకు న్యాయం చేకూరుస్తానని చెప్పినందుకు అంతగా సంతోషిస్తున్నాను ఆ మార్పే నీలో రాకుండా ఉంటే నీతో నా పెళ్ళి జరిగి ఉంటే ముందు జీవితం ఎంత అస్తవ్యస్తంగా తయారయ్యేదో ఆలోచించు ఆడదానిగ సాటి ఆడదాని జీవితం గురించి ఆలోచించి నీనుండి తప్పుకుంటున్నాను కానీ ఒక్క విషయం ఇక ముందు ఏ విషయంలో కూడా సరళకు అన్యాయం చెయ్యవద్దు

శ్వేత చెప్పిన మాటలవి

నన్ను అసహ్యించుకోకుండా ఆప్తురాలిగ, స్నేహితురాలిగ, అబిమానించే వ్యక్తిగ శ్వేత చెప్పిన మాటలకు నేను పూర్తిగ మారిపోయాను

వెంటనే ఇంటికి వెళ్ళాను

"సరళను ఇంటికి తీసుకు వస్తాను

అని అమ్మకు చెప్పాను

అమ్మ నా మాట వినిపించుకోలేదు

అమ్మా నాన్న నీకు మరో సంబంధం చూస్తున్నట్టు కట్నం యాభైవేలు వస్తుందని చెప్పింది విని ఆశ్చర్యపోయాను

"మళ్ళీ పెళ్ళేమిటి అడిగాను

"నీ భార్య ఇంకా ఎక్కడుంది ఎక్కడకో వెళ్ళిపోయింది

అమ్మ చెప్పింది విని కొయ్యబారిపోయాను

"అవునురా సరళ ఆత్మహత్య చేసుకున్నట్టు ఆ ఊరునుండి వచ్చిన వాళ్ళు చెప్పారు ముందు మేము నమ్మలేదు పరుగెత్తుకుని వెళ్ళాం అక్కడ సరళలేదు నెలలు గడిచినా సరళ జాడ తెలియలేదు నీకు ఈ విషయం చెప్పితే బాధపడతావని చెప్పలేదు " అన్నాడు నాన్న

సరళ ఆత్మహత్య చేసుకుందా

ఇది నిజమా

**జరిగిన కథ 9 : దేదీప్యకు సరళ భర్త రాఘవ తటస్థ పడతాడు. అతను తన గురించి పూర్తిగా దేదీప్యతో చెప్పసాగాడు.**

ఆ రోజు మామయ్య ఊరు వెళ్ళాను

సరళ చిన్నాన్న, పిన్నిగారు చెప్పిన విషయాలకు నా కళ్ళు చెమ్మగిల్లాయి

నా కోసం డిగ్రీవరకు చదువుకుందట

చదువు ఉంటే నేను ప్రేమిస్తానన్న ఆశట

సరళ ఎక్కడుందని అడిగాను

వాళ్ళు చెప్పింది విని నిలువునా నీరుగారిపోయాను

సరళను తన తల్లి తండ్రులు ఎంత అవమానించారో కూడా చెప్పారు

కొందరు ఆత్మహత్య చేసుకుందన్నారు

కొందరు ఎక్కడికో వెళ్ళిపోయిందన్నారు

అందరూ పాపం ఆ అమ్మాయికి అన్యాయం చేసారు ఆ బాధ ఆడపిల్ల ఎన్నాళ్ళు భరిస్తుంది నిజంగా చనిపోయే ఉండవచ్చు బ్రతికుంటే ఒక్కసారైనా ఊరు రాకుండా ఉంటుందా చిన్నప్పటినుండి కష్టాలే అందంలేక పోవడం ఆమె తప్పా అందంగా లేని వాళ్ళకు పెళ్ళిళ్ళవడం లేదా, సంసారాలు చేయడం లేదా "

మరిక అక్కడ ఉండలేకపోయాను

తెలిసిన వాళ్ళనందరిని అడిగాను

సరళ తల్లి తండ్రులు చనిపోవడంతో బంధుత్వాలు అన్నీ తెగిపోయాయి సరళ గురించి ఎవరు పట్టించుకుంటారు వాళ్ళకేం తెలుస్తుంది సరళ ఎక్కడ ఎలా ఉందో

హైదరాబాదుకు వచ్చాను

శ్వేత సరళ గురించి అడిగితే ఏం చెప్పాలి

మరింత మూర్ఖుడిగా అంచనా వేస్తుంది

అయితే శ్వేత అడగలేదు

శ్వేత పెళ్ళి డాక్టరుతో జరిగిపోయింది

ఆ విధంగా శ్వేత దూరమైంది

సరళను దూరం చేసుకున్నాను

ఎలాగో ఆ సంవత్సరం చదువయిందనిపించాను

అమ్మా నాన్నల ముఖం చూడకూడదనుకున్నాను

తర్వాత ఇక్కడ ఉద్యోగం

అప్పుడప్పుడు సరళ గుర్తుకు వచ్చి నేనేం పాపం చేసాను నాకు ఈ శిక్ష ఎందుకు వేసారు అని అడుగుతున్నట్లనిపిస్తుంది ఆ సమయంలో నేనెంత మానసిక క్షోభకు గురియగుతున్నానో ఆ భగవంతునికే తెలుసు

దేదీప్యగారూ ఇంతవరకూ నా గురించి ఎవరికీ చెప్పకుండా నాలో నేనే కుమిలిపోతున్నాను మీకు చెప్పాను ఇంకా నన్ను అసహ్యించుకుంటున్నారా సరళకోసం నేను బాధ పడుతున్నానని ఒక్కరైనా నమ్మితే నాకు అంతే చాలు

అని చెప్పి గబ గబ బయటకు వెళ్ళిపోయాడు రాఘవ

దేదీప్య అలాగే నిలబడిపోయింది

వరండాలో కూర్చున్న మదుబాబు, శివప్రసాద్ ఆశ్చర్యపోయారు చెప్పకుండా గబగబ వెళ్ళిపోతున్న

రాఘవను చూసి

గదిలో దేదీప్య ఆశ్చర్యంనుండి తేరుకోలేదు

సరళకోసం రాఘవ ఎంత బాధ పడుతున్నాడో అర్థం చేసుకుంది

సరళ చనిపోలేదు మీరు వస్తారనే ఆశతో ఎదురు చూస్తూ అవమానాలను, అవహేళలను ఎదుర్కొంటూ జీవశ్ఛవంలా బ్రతుకుతుంది' అని చెప్పాలనుకుంది రాఘవతో అయితే దేదీప్యకు ఆ అవకాశం ఇవ్వకుండానే బాధతో వెళ్ళిపోయిన రాఘవను చూసి నిట్టూర్చింది

కొంతసేపయింతర్వాత బయటకు వచ్చింది దేదీప్య

రాఘవగారు అలా వెళ్ళిపోయారేమిటి?

శిల్ప అడిగింది

దేదీప్య అప్పుడు చెప్పింది రాఘవ, సరళల గురించి

మదు బాబు శివప్రసాద్, శిల్ప, సుస్మిత ఆశ్చర్యపోయారు

దేదీప్యగారూ ఒక స్నేహితురాలి జీవితాన్ని బాగు చేయడానికి మీరు చొరవ తీసుకుని అతని గురించి అన్ని విషయాలను బయటకు తీసుకొచ్చి అతనిలో మార్పును తీసుకొచ్చారు నిజంగా సరళ ఎంతో అదృష్టవంతురాలు మీలాంటి స్నేహితురాలు ఉన్నందుకు రేపు ఉదయమే రాఘవను తీసుకొస్తాను సరళ బ్రతికేఉందని ఆమెను ఓదార్చమని చెప్పండి విడిపోయిన భార్యాభర్తలను కలిపిన పుణ్యాం వస్తుంది

మధుబాబు దేదీప్యను మెచ్చుకుంటూ అన్నాడు

సుస్మిత, శిల్ప దేదీప్యను ఆకాశానికి ఎత్తేసారు

అరగంట మాట్లాడింతర్వాత ఎవరో వస్తే మదుబాబు బయటకు వెళ్ళాడు

సుస్మిత శిల్ప మాటల్లో పడ్డారు

గదిలో కూర్చున్న దేదీప్య దగ్గరకు వెళ్ళాడు శివప్రసాద్

దేదీప్యగారూ

దేదీప్య తలెత్తి చూసింది

శివప్రసాద్ కళ్ళల్లో వెలుగు అబినందన స్పష్టమవుతుంది

మీలో నాకు దేవత కనిపిస్తుంది అన్నాడు

దేదీప్య అందంగా నవ్వింది

* * *

మధుబాబు రాఘవను తీసుకొచ్చాడు

రాఘవ సిగ్గుతో తలెత్తుకోలేక పోతున్నాడు

అతనిలో పశ్చాత్తాపం కనిపిస్తుంది

మదుబాబు రామవ భుజం తట్టాడు

రాఘవా దేదీప్యగారు నీకు ఒక శుభ వార్త చెబుతారు

ఏమిటి?

రాఘవగారూ మీరు సరళ గురించి విన్నదంతా అబద్ధం పిరికిదానిలా చనిపోలేదు ఎప్పటికైనా మీరు మనసు మార్చుకుని వస్తారని ఆశతో ఎదురు చూస్తుంది డిగ్రీ అయింతర్వాత రాజమండ్రిలో టీచరుగా ఉద్యోగం సంపాదించింది తమ్ముడిని



## "అమ్మహస్తం"

జాతి కుల మత విభేదాల
పాలద్రోలిన హస్తం
రాజకీయ రాబందుల
భరతం పట్టిన హస్తం
నిరుపేదల దౌర్భాగ్యుల
కన్నీళ్ళు తుడిచిన హస్తం
ప్రపంచ శాంతి సౌహార్ద్రాల
ప్రభవింపజేసిన హస్తం
మన దేశ గౌరవం
వెలయించిన హస్తం
అదే మన ప్రియతమ ప్రధాని
ఇందిరమ్మ హస్తం
మన ప్రేమార్ద్రాలకు
అదర హస్తం
నేడు దివి జేరిన
దివ్య హస్తం

—సత్యశ్రీ

# దేదీప్య

చదివించింది దగ్గవరలో ఉండి కూడా మీ అమ్మ, నాన్న ఇంకా మీ బంధువులు ఎవరూ సరళ దగ్గరకు వెళ్ళలేదు అందరూ ఉన్నా ఒంటరితనం అనుభ-వించింది సరళ బ్రతికుందో లేదో కూడా ఎవరూ చూడలేదంటే మీ వాళ్ళు ఎంత మూర్ఖంగా ప్రవర్తిం-చారో చూడండి తర్వాత విశాఖ పట్నంలో ఉద్యోగం రావడంతో ఆ బాధనుండి దూరంగా వచ్చింది తమ్ముడు చదువయిం తర్వాత స్నేహితుల ద్వారా మద్రాసులో చిన్న ఉద్యోగం సంపాదించు-కుని వెళ్ళిపోయాడు అప్పుడప్పుడు సరళను చూసి వెళ్తుంటాడు సరళ ఒంటరి మీరు ఎప్పటికైనా మీ మనసు తన వైపు మళ్ళిస్తారనే ఆశతో, తప్పకుండా మీరు వస్తారనే నమ్మకంతో, ఆ శుభ ఘడియకోసం ఎదురుచూస్తూ ఒంటరిగా బ్రతుకును భారంగా నెట్టుకుని వస్తుంది

సరళ ఎంత బాధ పడుతూందో, మిమ్మల్ని తలంచుకుని ఎంతకుమిలి పోతుందో ప్రత్యక్షంగా చూస్తున్న నాకు తెలుసు ఆమెకు మీ చేయి అందివ్వండి ఆమె పెదవులపై చిరు నవ్వుల దివ్వెలు వెలిగించండి మోడు వారిన జీవిత హృదయ నందన-వనంలో పూలు పూయించండి ఆ ఒంటరితనం నుండి తప్పించి మీర్ధు దగ్గరకు తీసుకోండి "

అంది దేదీప్య ఆవేశంగా

సరళ బ్రతికే ఉందా

నిజమా

రాఘవకు ఆశ్చర్యంగా, ఆనందంగా ఉంది

అవును రాఘవా సరళ బ్రతికే ఉంది" అన్నాడు మధుబాబు

దేదీప్యగారూ సరళ బ్రతికే ఉందని, నా కోసం ఎదురు చూస్తుందని చెప్పారు. నా కేంతో ఆనం-దంగా ఉంది. నిజా నిజాలు చెప్పి మా జీవితాలను ఒక ఒడ్డుకు తీసుకొచ్చారు. మీకు నా కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో తెలియడంలేదు నాకంటె చిన్న-వారైన మీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను

రాఘవ ఆనందంగా దేదీప్య చేతులను పట్టుకుని కళ్ళకు అద్దుకున్నాడు

రాఘవ కనీళ్ళు దేదీప్య చేతులను తడిపింది

కంగారు పడింది దేదీప్య

రాఘవా బాధపడవద్దు ఇప్పటికైనా నిజం తెలుసుకున్నావు సరళను ఆ ఒంటరితనం నుండి తప్పించు ఆమెను ఓదార్చు వెంటనే ఇక్కడకు తీసుకురా'

మదుబాబు రాఘవను ఓదార్చి చెప్పాడు

దేదీప్యగారూ సరళ ఎక్కడుందీ చెప్పండి

దేదీప్య సరళ వివరాలు చెప్పింది

రాఘవ దేదీప్యకు మరోసారి కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయాడు

అందరి హృదయాలు తేలిక పడ్డాయి

ఇప్పుడు మన ప్రోగ్రాం ఏమిటి?

భోజనాల దగ్గర అడిగింది శిల్ప

ఏముంది రేపు మన తిరుగు ప్రయాణం అంది దేదీప్య

అప్పుడే వెళ్ళడానికి వీల్లేదు'

అని సుస్మిత ఇంకేదో చెప్పబోతుంటే అడ్డు పడింది దేదీప్య

వచ్చి నాలుగు రోజులైంది రెండ్రోజుల్లో వస్తానని నాన్నగారికి చెప్పాను ఇంకా వెళ్ళకపోతే కంగారు పడతారు

చివరకు ఎలాగైతేనేం ఒప్పుకున్నారంతా మర్నాడు రామప్ప వెళ్ళి అక్కడనుండి శిల్ప హైదరాబాదు శివప్రసాద్, దేదీప్య వైజాగ్ వెళ్ళిపోడానికి నిర్ణ-యించుకున్నారు

## 31

ఉదయం ఆరుగంటలకు బస్సు ఎక్కితే ములుగు దగ్గర వెళ్ళేసరికి తొమ్మిదయింది అక్కడనుండి రామప్ప 15 కిలోమీటర్ల దూరం ములుగునుండి బస్సులున్నాయి

ములుగులో టిఫినుచేసి బస్సెక్కారు

రామప్ప చేరుకున్నారు

చారిత్రాత్మకమైన స్థలమది రోజూ చాలా మంధి విజిటర్లు వస్తుంటారు పిక్నిక్ సమయాలలో చాలా రద్దీగ ఉంటుంది శిల్పుల పనితనం ప్రతి శిల్పంలో కనిపించి ఆశ్చర్య పరుస్తుంది

గోపురం ద్వారం దాటగానే గుడిలోపల కెళ్ళే దారిలో రెండు స్థంభాల మీద నగ్నస్త్రీల బొమ్మలు చెక్కబడి ఉన్నాయి గుడిలో శివుని విగ్రహం

శివుని ముందు నంది

నందిలోని ప్రత్యేకత అందరినీ ఆకర్షించింది

ఏ వైపునుండి చూసినా ఆ నంది మన వైపు చూస్తున్నట్లు కనిపిస్తుంది

అందరూ ఆ నంది ముందు తిరుగుతుంటె

---

ఇటీవల అమలాపురంలోని శ్రీ సి వి సర్వేశ్వరశర్మ స్వగృహంలో ఏర్పాటు చేసిన సాహిత్య శాస్త్రీయ ఇష్టాగోష్ఠి కార్యక్రమంలో పాల్గొన్న కుమారి కందా భాస్కరం (గణిత విభాగం అధిపతి) శ్రీమతి వెంకటరత్నం (ఇంగ్లీషు విభాగం), డా శ్రీమతి పి వి సత్యవతి, శ్రీ సి. యస్. సోమయాజులు, శ్రీ తుర్లపాటి కుటుంబరావు శ్రీ వి వేణుగోపాల్ (ప్రిన్సిపాల్) డా పి చిరంజీవిరాజు, శ్రీ జి. యల్. యన్. హేమ్, శ్రీ సి. వి. సర్వేశ్వరశర్మలను చిత్రంలో చూడవచ్చు.



శివప్రసాద్ అలా నంది ముందు ఉండకూడదన్నాడు

ఎందుకని' అడిగింది దేదీప్య

గుడిలోకి ప్రవేశించేటప్పుడు ఈశ్వరునికి ఎదురుగా ఉండే నందిని అడ్డగించి పోగూడదు ఎందుకంటె ఆ నంది తన ముక్కు ద్వారములగుండ ఆడుచుండెడి ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలతో చామరమువలె ఈశ్వరునికి విసురుతుందని పెద్దలు చెబుతుంటారు అందుచేత ఈశ్వరునికి విసురునపుడు ఆ వృషభమును అడ్డగించకూడదు ఇది ఒక ప్రమాణము దేవాలయములలోని నంది యొక్క రహస్యమిది

అని చెప్పాడు శివప్రసాద్

వింతగా ఉంది అందరికి

గర్భ గుడిలోకి వెళ్లారు

ఒక స్థంబంమీద ముగ్గురు స్త్రీలు నాట్యం చేస్తున్నట్లు చిత్రం ఉంది అయితే శిల్ప నైపుణ్యత ఏమిటంటే ఆ భంగిమలో నాలుగు కాళ్లే కనిపిస్తాయి

గర్భగుడి దాటిం తర్వాత ముఖ ద్వారం కుడిప్రక్క సరిగమలు పలికించే ఏడు చిన్న స్థంభాలు గర్భగుడి గోడలపై ఆనాటి రాజుల, రాణుల ఆభరణాలు చెక్కబడి ఉన్నాయి

మరొకచోట కాగడా పట్టుకున్న స్త్రీ శిల్పం ఈ శిల్పంలో ప్రత్యేకత స్పష్టంగా కనిపిస్తుంది అడుగు ముందుకు వేసినపుడు మడమ మధ్యన స్పేస్ స్పష్టమవుతుంది

**గుడిలో కొబ్బరికాయ కొట్టి బయటకు వచ్చారు**

ఒక దగ్గర కూర్చున్నారు

**గుడిలో ఎందుకు కొబ్బరికాయ కొడుతారు"**

**అడిగాడు శివప్రసాద్**

**అవును ఎందుకు కొడతారు**

"ఇది చిన్న విషయమే కానీ దేవుడి ముందు కొబ్బరికాయ కొట్టి ఆ దేవునికి నివేదన రూపముగ చూపుటకు రహస్యార్థము చాలా ఉంది "

దేదీప్య, శిల్ప, సుస్మిత శివప్రసాద్ చెబుతున్న విషయాలు శ్రద్ధగా వింటున్నారు

కొబ్బరికాయను విడదీయక మునుపు పైపట్ట పసుపుగ, అందముగ ఉంటుంది పైపట్ట విడదీయునప్పుడు బహు కష్టముగా ఒకదాని నొకటి చిక్కుకుని విశేష చిక్కులు చిక్కులుగా వస్తుంది ఆ చిక్కులను విడదీసి కొబ్బరికాయను పగులకొట్టితే తెలుపు రంగులో గల కొబ్బరి కనిపిస్తుంది దీనిని మనం దేవునికి చూపిస్తుంటాం ఇలా ఎందుకు చూపిస్తున్నామంటే

స్త్రీ పురుషులు యొక్క పై చర్మము రంగు రంగులలో నునుపుగా ఉన్నా శరీరములోపల రకరకాల ఆశాపాశలనెడి చిక్కులు ఒకదాని నొకటి పెనవేసుకుని ఉంటాయట శరీరలో ఉండే ఈ ఆశాపాశలనెడి చిక్కులను విడదీసినపుడు కొబ్బరికాయ




యందుండే తెల్లని వన్నెగల పదార్థమున్నట్లు ప్రతివాని దేహంలో శుద్ధ ఆత్మ స్వరూపము ఉంటుందట ఈ పరమాత్మ స్వరూపమును అనేక జన్మములనుండి కొంత కొంతగా కప్పుచూ వచ్చుచున్న ఆశాపాశలనెడి చిక్కులన్నింటిని విడదీసి పరబ్రహ్మ స్వరూపమునందు ఐక్యము చేయుమని విన్నవించుటకు కొబ్బరికాయను కొడతారు కొబ్బరికాయ పైనున్న పీచును ఆశాపాశలగను, లోపల తెల్లటి పదార్థమును ఆత్మ స్వరూపముగ పోల్చి చెబుతారు మనలోని ఆత్మను ఈ ఆశాపాశలనెడి చిక్కులు కప్పి ఉన్నాయట

కొబ్బరికాయ కొట్టి కర్పూరపు బిళ్ల వెలిగిస్తారు కదా!

ఈ కర్పూరపు గడ్డ యంతయు ఏ విధముగ కరిగి ఏ మాత్రం మిగులకుండా జ్యోతి స్వరూపములో కలసిపోవుచున్నదో ఆ విధముగా ఈ ఆశాపాశలనెడి చిక్కులనెడి కర్మములను కర్పూరపు గడ్డవలె కరగించి ఆత్మ స్వరూపమును, పరమాత్మ స్వరూపమగు భగవంతునిలో లీనము చేసుకొమ్మని ప్రార్థిస్తారట ఇదీ దేవుని ముందు కొబ్బరికాయ కొట్టి, కర్పూరపు బిళ్ల వెలిగించుటలో ఉన్న రహస్యార్థమని పెద్దలు చెబుతుంటారు

దేదీప్య శివప్రసాద్‌ను కొత్తగా చూసింది

ఇతనిలో తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయనుకుంది

రాముప్పలో పదకొండు గంటలవరకు ఉండి టాక్సీలో కాజీపేట్ వచ్చారంతా

అప్పటికే సికిందరాబాద్ వెళ్లే కోణార్క్ ఎక్సుప్రెస్ రెడిగా ఉంది

బావా " అంది శిల్ప శివప్రసాద్ దగ్గరకు వచ్చి

శివప్రసాద్‌కు సుస్మిత చెప్పిన విషయాలు గుర్తుకు వచ్చాయి

శిల్ప వచ్చేనెల మామయ్య వైజాగు రాగానే నేను అన్ని విషయాలు మాట్లాడుతాను నిక్షేపంగా ఉండు అన్నాడు నవ్వుతూ

బండిలో కూర్చుంది శిల్ప

శివప్రసాద్, దేదీప్య, సుస్మిత, మధుబాబు, శిరీష అందరూ టాటా చెబుతుంటే బండి కదిలింది

ఇంకొక గంటలో సికిందరాబాదునుండి భువనేశ్వర్ వెళ్లే కోణార్క్ వస్తుంది

దేదీప్యగారూ నా మాట మన్నించి మీరు వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది "

అంది సుస్మిత

దేదీప్య నవ్వింది

కాఫీలు త్రాగి కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు ప్లాటుఫారంమీద

పెళ్లికూతురులా నిండుగ వచ్చి ఆగింది కోణార్క్

గబగబ ఎక్కారు శివప్రసాద్, దేదీప్య

శిరీషను ఎత్తుకుంది దేదీప్య

"దేదీప్యగారూ మీరు సరళ, రాఘవల జీవితంలో వెలుగును చూపించడంతో నా దృష్టిలో మహోన్నత వ్యక్తిలా కనిపిస్తున్నారు మీ పెళ్లికి మాత్రం మమ్మల్ని పిలవడం మరచిపోవద్దు"

మధుబాబు మాటలకు సుస్మిత నవ్వింది

బండి కనుమరుగయ్యేవరకూ శివప్రసాద్, దేదీప్య, శిరీష చేతులూపారు

**(ఇంకా ఉంది)**



ఆకాశం బాగా ముసురుపట్టి సన్నగా వానతుంపర మొదలయ్యింది

రాత్రి

సమయం అట్టే కాలేదు ఏడే

కాని చలికాలం కావటంతో ప్రొద్దు గ్రుంకక ముందే చీకట్లు దట్టంగా ముసురుకున్నాయి దానికితోడు వాన మొదలు

చల్లటి ఈదర గాలితో పాటు సన్నగా వానజల్లు మొదలయింది

నున్నటి తార్రోడ్డు మీద మెత్తగా జారిపోతోంది లేత ఆకుపచ్చ రంగు ఫియెట్‌కారు

అద్దం మీద పడుతున్న చినుకుల్ని వైపర్సు ఎప్పటి. కప్పుడు నీట్‌గా తుడుస్తున్నాయి

దూరంగా ఎర్రగడ్డ హాస్పిటల్ బోర్డు అక్షరాలు ఎర్రటి లైటు కాంతిలో మెరుస్తున్నాయి

కారు అద్దం లోంచి చీకటి వెలుపల్ని చూస్తూ నిశ్శబ్దంగా డ్రైవ్ చేస్తున్నాడు సురేష్

ఇది వరకు అతను చాలా అల్లరిగా వుండేవాడు చాలా ఆనందంగా లైఫ్‌ని ఎంజాయ్ చేసేవాడు

కాని ఈ మధ్య అతని మనసు చాలా స్తబ్దుగా అయిపోయింది

సరి అయిన ఉద్యోగావకాశలు లేక కొంత కాలం క్రితం ఒక చిన్న వ్యాపారం ప్రారంబించాడు

కాని అతని రోజులు బాగాలేవు

ఏదీ కల్సిరావటం లేదు బంగారం ముట్టుకున్నా మట్టి అయిపోతోంది

వ్యాపారంలో లాభం మాట అటుంచి అసలుకే మోసం వచ్చేటట్లు నడుస్తోంది

దాంతో రోజు రోజుకి మనసుని ఆనందం దూరం అయి పోతూంది అశాంత్తే మిగులుతోంది అప్రయత్నంగా కీచు మని శబ్దం చేస్తు కారు షడన్ బ్రేక్‌తో ఆగిపోయింది

చప్పున ఆలో చన్ల నుంచి తేరుకున్నాడు సురేష్

అన్య మనస్కంగా వుండి అతను గమనించలేదు

వానలో తడుస్తూ ఎవరో ఒక యువతి చెట్టుకింద బస్సు స్టాప్‌లో నిల్చుని వుంది

గబగబా రోడ్డుకి అడ్డంగా వచ్చి కారు ఆపమన్నట్లు చెయ్యి వూపింది

ఆలో చన్లలో పడి ఆమెని గమనించనందుకు మనస్సులో నే తనని తాను నొచ్చు కున్నాడు సురేష్

కారు హంసలా మెల్లగా వచ్చి ఆమెని సమీపించింది

లైట్ల వెలుగులో ఆమెని పరిశీలనగా చూశాడు తెల్లగా కాస్త బొద్దుగా వుంది లేత గులాబి రంగు ఫుల్ వాయిల్ చీర అలాంటిదే చోళీ ధరించింది ఒంకీలు తిరిగి కాస్త కురచగా వున్నా జుత్తుని రెండు జడలు అల్లుకుంది చెవులకి నల్లటి క్రిస్టల్స్, చేతులూ మెడా బోసిగా వున్నాయి ఈ కాలం అమ్మాయిల్లా నిరాడంబరంగా వున్నా స్వీట్ అండ్ సింపుల్ గ వుంది అనుకున్నాడు

అంతలో నే జుయ్ మంటూ గాలి బలంగా విసిరింది దాంతో పాటే వానజల్లు పెద్ద దయ్యింది

"ప్లీజు నేను ఆమె బిడియంగా ఏదో చెప్పబోయింది

సురేష్ చప్పున ఫ్రెంట్ డోర్ తెరిచి పట్టుకున్నాడు

"ముందు మీరు కారెక్కండి తడిసి పోతున్నారు అన్నాడు

ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్న ఆమె చప్పున కారులో కూర్చుని తలుపు మూసింది నెమ్మదిగా స్టార్టయి కారు క్రమంగా వేగాన్ని పుంజుకుంది

అంతవరకు చికాకుగా వున్న అతని మనసు చక్కటి అమ్మాయి కారు ఎక్కటంతో ఉల్లాసాన్ని పుంజుకుంది

"చెప్పండి ఎక్కడి కెళ్ళాలి?" అన్నాడు కులాసాగా ఆమెకేసి చూస్తూ



# ఈ దేశపు సరిహద్దు చివరికి మీ గడప అవుతుందా ఏమిటి?



చూస్తే అనిపిస్తోందిక—కొన్నాళ్ళ తర్వాత యీ లక్షలకి లక్షల హిందువులు, ముస్లిములు, సిక్కులు, క్రిష్టియన్లు, మహారాష్ట్రులు, గుజరాతీలు, బెంగాలీలు, అస్సామీయులు, తమిళులు, తెలుగువాళ్ళు, యీ జనసందోహంలోంచి భారతీయుడెవ్వరో తెలుసుకోవడం దుర్లభం అయిపోతుందా ఏమిటి అని?

అస్సాము పంజాబు

దేశపు సరిహద్దుల్ని, మన ఆస్తిపాస్తుల్ని కాపాడవలసిన పహారా గోడలు, మనల్ని, మన కుటుంబాల్ని, హృదయాల్ని వేరుచేసే అడ్డుగోడలుగా మారిపోయి, భాషకీ భాషకీ, మతానికి మతానికి మధ్యన అగాధాలైపోతున్నాయి ఇవి ఎవరికి పనికొస్తున్నాయి, వేటిని పరిరక్షిస్తున్నాయి

మీకు తెలుసు వాళ్ళెవరో

వ్యక్తిగత కక్షల్ని ప్రజాందోళన హేతువులుగా మార్చజూస్తారు వీళ్ళు దేశపు వెన్నులో చురకత్తి పొడిచి, రోషాలకీ, తమ అభీష్టాలకీ ప్రజాభీష్టపు ముసుగును వేసి వాటితో తమకొక స్థానాన్ని కల్పించుకుంటారు జెండా పైకెత్తి ఆ స్థానానికి దేశపు పేరిస్తారు

ద్వేషాన్ని నాటి, అడ్డు గోడలు లేపి, రక్తపాతంతో దాన్ని పెంచుతారు

కాని, విడదీసే ఆ హద్దుపైన పడేది మీ అడుగు, చిందే రక్తం మీది, మరి ఆ సందర్భంలో, మీరిచ్చే వోటుతో పదవుల్లో కొస్తారు

అసలు మీ యిరుగు పొరుగువారు మరో మతానికి చెందినా, మరో భాష మాట్లాడినంత మాత్రానా మీరు అలా యిరకాటంలో పడటం ఎందుకని? మీరెక్కిన టేక్సీని మరో రాష్ట్రానికి చెందిన వ్యక్తి నడుపుతున్నంత మాత్రాన మీరలా తబ్బిబ్బు అయిపోవడమెందుకూ అని? కాని కళ్ళకు కనిపించే చూసే యీ ముఖాలే మీకలా అనిపించేలా చెయ్యొచ్చు

నిజానికి చూస్తే కాంగ్రెస్ (ఐ), జాతీయ అవసరాలకి, జాతీయ సరిహద్దులకి, జాతీయ ఐక్యతకి నిలబడింది ఎప్పుడూ

మరి కేవలం కాంగ్రెస్ (ఐ) మాత్రమే ఆ అడ్డుగోడల్ని పడగొట్టగలదు

కేవలం కాంగ్రెస్ (ఐ) మాత్రమే దేశం అంతటిని ఒక్కటేనని భావిస్తుంది, అలా అనుసరిస్తుంది

కేవలం కాంగ్రెస్ (ఐ) మాత్రమే దేశం భిన్నాభిన్నంగా ముక్కలుగా కాకుండా ఒకళ్ళతో ఒకళ్ళు ఘర్షణ పడకుండా, దాంతో ఒకళ్ళ నొకళ్ళు నాశనం చేసుకోకుండా ఉండేలా చెయ్యగలుగుతుంది

భారతదేశం నిలిచి మనగలిగితేనే మీరు మనగలిగేది కేవలం కాంగ్రెస్ (ఐ) మాత్రమే భారతదేశం ఒక్కటిగా మనగలిగేలా చెయ్యగలుగుతుంది

అంటే, మీరు నిలబడగలగడానికి ఆధారం మీ వోటు

అంతటి తేడాని తేగలుగుతుంది మీ వోటు నిలబడగలగడం, వినాశనం వీటికి గల ఆ తేడాని

ఐక్యతకి, విడిపోవడానికి మధ్యన గల ఆ తేడాని. కాంగ్రెస్ (ఐ)కి యిచ్చే మీ ఆ ఓటు

## ఐక్యతా? విడిపోవడమా? దీన్ని నిర్ణయించేది మీ వోటు.



## ఐక్యతకు చేయూత నివ్వండి.

Issued by Chandulal Chandrakar, General Secretary, A I C C, 24, Akbar Road, New Delhi 110011 Rediffusion/AICC/1s/TL




"మీకేం ఇబ్బంది లేదు కదా?

"నో నాటటాల్

తియ్యగా నవ్వాడు.

ఆమె నెమ్మదిగా చెప్పింది

"మా ఫ్రెండ్ ఒకామెకి మెంటల్ ఎపెక్టు ఇచ్చింది ఎర్రగడ్డ హాస్పటల్‌లో చేర్పించారు చూద్దామని వచ్చాను నే వెళ్ళేసరికి డాక్టర్లు పరీక్షలు చేస్తున్నారు దాంతో నాకు అనుకోకుండా ఆలస్యం అయిపోయింది చీకటి! వాన! బస్సులు వచ్చేటట్టు లేవు తప్పనిసరై మీకు ట్రబులిచ్చాను"

"ఫరవాలేదు లెండి చిన్నగా నవ్వాడు

ఇంతకీ మీరు ఎక్కడికి వెళ్ళాలి?

"సికింద్రాబాదు వెళ్ళాలండీ

"నో ప్రాబ్లమ్ నేనూ అటే వెళుతున్నా లెండి అడ్రస్ చెప్పండి మిమ్మల్ని డ్రాప్ చేస్తాను"

"సెంటర్‌లో దింపెయ్యండి అక్కడికి మా ఇల్లు చాలా దగ్గర డి జి రావ్ పోలీస్ సూపరెండెంటుగారు మా డేడీ! ఆయన వూళ్ళో లేదు లేకపోతే కారు పంపించేవారు నాపేరు సంధ్య

అంతే!

ఆమె నోటి వాక్యం పూర్తి కానేలేదు

పక్కలో బాంబు పేలినట్టు వులిక్కి పడబోయి అంతలో నే తమాయించుకున్నాడు సురేష్

మర్యాదతో ఆమెకి కాస్త దూరంగా జరిగి సర్దుకుని కూర్చున్నాడు

ఓ! వెరిగ్లాడ్ టు మీట్ యు నా పేరు సురేష్ కుమార్ బిజినెస్ చేస్తున్నాను

థైస్ టు సే యూ సంధ్య సన్నగా నవ్వింది

ఆ తరువాత ఇద్దరి మధ్య ఎక్కువగా సంభాషణ సాగలేదు అతను మళ్ళీ ఆలోచన్లలో పడిపోయ్యాడు

అంతవరకు కొంచెం స్లోగా నడుస్తున్న కారు క్షణంలో వేగాన్ని పుంజుకుంది

వర్షం జల్లుగా కురుస్తూనే వుంది

పావు గంటలో కారు సికింద్రాబాద్ స్టేషన్ ప్రక్క

## ఆడాళ్ళూ! మీకు జోహార్లు

నుంచి టర్న్ అయి డి జి రావ్ సూపరెంటెంట్ ఆఫ్ పోలీస్‌గారి విశాలమైన భవంతి ముందు ఆగింది

సంధ్య వదనం ప్రఫుల్లం అయ్యింది

బిల్డింగ్ ముందు పోలీస్ ఆఫీసర్‌గారి నేమ్ బోర్డ్ లైటు కాంతిలో మెరుస్తూంది

చప్పున డోర్ తెరుచుకుని కారు దిగింది

థాంక్సండి మీరు సమయానికి లిఫ్ట్ ఇవ్వకపోతే ఈ వర్షంలో నేను ఎంతో ఇబ్బంది పడి వుండేదాన్ని మీ మేలు మర్చిపోలేను ఎప్పుడైనా అవకాశం వస్తే తిరిగి మీ ఋణం తీర్చుకుందుకు ప్రయత్నిస్తాను మళ్ళీ ఒకసారి కృతజ్ఞతలు చెప్పి వడి వడిగా వెళ్ళబోయింది

అతను కాస్త ఇబ్బందిగా ఆమె మొఖంలోకి చూసి మేడమ్ అన్నాడు రిక్వెస్ట్ చేస్తున్నట్టు

ఆమెకి ఆశ్చర్యం అనిపించింది

ఆగి వెనక్కి తిరిగి 'ఏమిటి? అన్నట్టు అతని మొహం లోకి చూసింది

చూడండి ఎప్పుడైనా అవకాశం వస్తే నాకు సహాయం చేస్తా నన్నారుకదా?

అవును

'ఇలా అడుగుతున్నందుకు ఏమి అనుకోకండి ప్లీజ్ మీకు అభ్యంతరం లేకపోతే ఇప్పుడే మీరు నా కొక సహాయం చెయ్యగలరా? ఇఫియు డోంట్ మైండ్



ఏమిటి!?

సురేష్ తప్పు చేస్తున్న వాడిలా చప్పున తల వంచుకుని చెప్పాడు

ఆ మధ్య నే నొక చిన్న రోడ్డు ఆక్సిడెంట్ కేస్‌లో ఇరుక్కున్నాను నిజానికి అందులో నా తప్పేమీ లేదు కాని కోర్టుల చుట్టూ తిరగలేక ఛస్తున్నాను దయచేసి మీకు అభ్యంతరం లేకపోతే మీ నాన్నగారికి చెప్పి నాపై మోపబడిన ఆ కేసు మాఫ్ చేయించగలరా? ప్లీజు నా ప "

సంధ్య చప్పున తల దించుకుంది క్షణంలో మబ్బు తెర కమ్మినట్లు నీలి నీడలు ఆమె వదనంలో చోటు చేసుకున్నాయి గిల్టీగా తనకి తాను చెప్పుకుంటున్నట్టు అంది

సారీ

!?

నన్ను మన్నించండి డి జి రావు గారు మా నాన్నగారు కాదు ఈ బిల్డింగ్ మా ఇల్లు కాదు ఆర్నెల్లుగా ఎర్రగడ్డ హాస్పటల్‌లో వున్నది మా అమ్మ మా నాన్నగారు చనిపోయారు మేం పేదవాళ్ళం నా దగ్గర డబ్బు లేకపోయినా, చాలా రాత్రి అయినా నేను ఇలాగే ఎవరి దగ్గరైనా కార్లో "లిఫ్ట్ తీసుకుంటాను కేవలం నా రక్షణ కోసం డి జి రావ్ మా నాన్నగారని చెప్పాను అంతే ఈ బిల్డింగ్ వెనకాల సందులో మా ఇల్లు

ఆ !?

అతడు దిగ్భ్రాంతుడయి పొయ్యాడు

ఆశ్చర్యంతో కొద్ది సేపు అస్థిమితం అయి ఆ తరువాత తేరుకుని తల ఎత్తాడు

అప్పటికే ఆమె వేగంగా పరుగులాంటి నడకతో డి జి రావ్ బిల్డింగ్ పక్క సందులోకి మాయం అయ్యింది!

అంతే!

అప్రయత్నంగా అతని చెయ్యి గుండెల మీదకి వెళ్ళింది

స్థంభీ భూతుడవుతూ అమ్మో! ఆడది! అనుకున్నాడు! □

The first raindrop on my tongue.

To see a rainbow on the dew.

Flowers sway to a breezy song.

Today is mine. Today is new.



tit bits MOUTH FRESHENER

NP Marketed by the National Products, Bangalore

*Kiss-cool breath. Any place. Anytime.*

Dattaram–VMC 1B/84

# దక్షిణ కోస్తాలో తుఫాన్ భీభత్సం



నెల్లూరు జిల్లా నాయుడుపేట దగ్గర తుఫాను భీభత్సం వల్ల జల దిగ్బంధంలో చిక్కుకున్న వాహనాలు



పెను తుఫాన్ తాకిడికి గురైన ప్రాంతాన్ని విమానంలో నించి చూస్తున్న ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధీ



వెందోడు - నిడిగల్లు స్టేషన్‌ల మధ్య రైలు కట్ట కొట్టుకొనిపోగా గాలిలో వ్రేలాడుతున్న రైలు పట్టాలు



ఇటీవల తుఫానుకు నాయుడుపేట - సూళ్ళూరుపేటల మధ్య జాతీయ రహదారి తీవ్రంగా దెబ్బతిన్నది. రోడ్డు కోసుకు పోయిన దృశ్యం

గూడూరు వద్ద కూలిపోయిన రైలు వంతెనని తాత్కాలికంగా బాగు చేసి రైల్వే లైను రిపేరు చేసిన తరువాత ద. మ. రైల్వే జనరల్ మేనేజర్ శ్రీ మల్లిక్ మొదటి రైలుని దానిమీదనించి పంపుతున్న దృశ్యం







# ఇక ముందు మీ సరుకుల జాబితాలో ఏసిడ్ బల్బులూ, ఇనప వూచలూ, కత్తులూ కఠార్లూ ఉండబోతున్నాయా ఏమిటి ?

తన కుటుంబాన్నీ, ఆస్తినీ కాపాడుకునేందుకు రక్షణ కల్పించుకోవలసిన అగత్యం ఎప్పుడు ఎందుకు కలుగుతుంది అసలు ?

చట్టానికి గల అంగాలు ఆ పనిని చెయ్యనప్పుడు

కేంద్రంలోని అధికారం నీరసించినప్పుడు

కేంద్రంలో అధికారంలోకి వచ్చినవారు పరస్పరం ఘర్షణ పడుతూ, బలాబలాలు చూసుకుంటూన్నప్పుడు, కత్తులు దూసుకుంటూన్నప్పుడు మరి శాసన పరిరక్షకులే అవాకరూకులైతే, విష సర్పాలు పొరియలలోంచి బయట కొస్తాయి, విధ్వంసక శక్తులు వీధుల్లో మాటేస్తాయి, మామూలుగా కనిపించే పౌరులే వాళ్ళ ముసుగులు తొలగించుకుని నీడల్లో తారసలాడతారు, అదనుకోసం ఏసిడ్ బల్బులూ, ఇనప పూసలూ, కత్తులూ, కఠార్లూ వాడే సమయంకోసం

గుర్తుందా 1977 ?

ఆనాటి వివిధ పార్టీలు విలీనం అవడం అన్నది, చట్టం, శాంతి భద్రతలనిచ్చే శక్తిగల బలం అవడానికి బదులు, నిరాశ, అవకాశవాదం వీటి సమ్మేళనంగా మారింది

పదవుల్లోకి రాగానే అయిందది ఛిన్నాభిన్నం కాంగ్రెస్ (ఐ), శక్తివంతమైన కేంద్ర ప్రభుత్వాన్ని యిస్తూ వస్తోంది ఎప్పుడూ ఎందుకంటే, సర్వసమన్వితమైన ఆదర్శం, సూత్రం గల జాతీయమైన పార్టీ కేవలం కాంగ్రెస్ (ఐ) ఒక్కటే గనక

దేశాభిమానంతో గత నూరు సంవత్సరాలుగా దేశసేవ చేస్తున్న పార్టీ యిది కేంద్రంలో కాంగ్రెస్ (ఐ) ఉన్నప్పుడే అల్ప సంఖ్యాక వర్గాలకి భద్రత, రక్షణ ఉంటుందనే భరోసా, ఎందుకంటే కేవలం కాంగ్రెస్ (ఐ) పార్టీకి ఎలాంటి ప్రాంతీయమైన, మత సంబంధమైన సంకీర్ణ దృక్పథం లేదు గనక

లోపలా, బయటాగల విధ్వంసక శక్తుల్ని పెకలించివేసింది కాంగ్రెస్ (ఐ)—జంకూ గొంకూ లేకుండా

మీ సరుకుల జాబితా, ఆయుధాల జాబితాగా మారకుండా ఆపుచేయగలదు మీ ఓటు

శాంతి భద్రతలను పటిష్టం చేయగలుగుతుంది మీ వోటు

అంతటి తేడాని తేగలుగుతుంది మీ వోటు

శాంతికి, అరాచకానికి మధ్యనగల ఆ తేడాని కాంగ్రెస్ (ఐ)కి యిచ్చే మీ ఆ వోటు

## శాంతియా? అరాచకమా? దీన్ని నిర్ణయించేది మీ వోటు.



## శాంతికి చేయూత నివ్వండి.

Issued by Chandulal Chandrakar, General Secretary, A I C C , 24, Akbar Road, New Delhi 110 011 Rediffusion/AICC/2s/TL



కృష్ణ, అంబిక, 'దొంగలు బాబోయ్ దొంగలు

## సినిమా



వేణు నటిస్తున్నారు ఆత్రేయ మాటలు పాటలు రాశారు హాస్యరసాన్ని కాకినాడలో ప్రముఖ లాయర్ చెన్నా ప్రగడ సూర్యనారాయణమూర్తి అందించారు నిమాయ్ ఘోష్ ఛాయా గ్రహణ దర్శకత్వంలో బి జనార్ధనరావు ఛాయాగ్రాహకుడు కె వి మహదేవన్ సంగీతం, వాలి శిల్పం, ఎ సంజీవి కూర్పు శాయిబాబు సహ దర్శకత్వం కృష్ణకుమార్ నృత్యాలతో కోట రాంబాబు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్

### నవ నటీనటులతో "సాగర మధనం"

ప్రేమకు, స్వార్థానికి మధ్య నలిగే ఓ మనసు కథ ఇందులో ఒక అసాధారణమైన సమస్య ఉంది దాన్ని తన కుటుంబ సభ్యులతో గాని, మిత్రులతో గాని హీరో పంచుకోలేడు గరళంలాంటి ఆ ప్రేమను మింగలేడు విషాదాంతమయ్యే చిత్రమైన ఈ ప్రేమ కథా చిత్రంలో నటించే వారందరికీ రంగస్థలానుభవం ఉన్నా - కెమెరాకు కొత్త గనుక షూటింగ్ ప్రారంభించడానికి నెలరోజుల ముందునుంచి మా సృజన చిత్ర కార్యాలయంలో రిహార్సల్స్ చేయించాం తమకు చక్కని భవిష్యత్తు గలదనే రీతిలో అందరూ చక్కగా నటించారు. అన్నారు ముంజులూరి భీమేశ్వరరావు ఆయన కథ, స్క్రీన్ప్లే దర్శకత్వంలో అంజనేయశర్మ, లక్ష్మం ఈశ్వరరెడ్డి నిర్మించే "సాగర మధనం"లో రజనీష్ సరసన రేఖ, బిందు నాయికలు డాక్టర్ రజనీకాంత్, సూర్య, దేవికారాణి, శ్రీరాం, విశ్వనాథశర్మ, బిందుమాధవి, జయవాణి, అనిల్, నందూరి, గరికపాటి,

### "ఓటుకి సెలవివ్వండి"లో నగ్న సత్యం

బహిరంగ సభ ఒక నాయకుడు ఉపన్యాసం మొదలెట్టాడు మహా ప్రజలారా! ఈ దేశంలో ఉన్న పార్టీలన్నిటిలోకి పురాతనమైన పార్టీ మాదే!

గుంపులో ఉన్న నగ్న సత్యం (శరత్‌బాబు) హుం అప్పటికి వీడు పుట్టనేలేదు అన్నాడు

నాయకుడు అనర్గళంగా ప్రసంగిస్తూనే ఉన్నాడు ఈ దేశం కోసం ఎన్నో యాపకాలు చేశాం ఈ దేశాన్ని ఎంతో అభివృద్ధి చేశాం బాక్రానంగల్

"ఆలయ దీపం"లో రాజేష్, కల్పన



'రజియా సుల్తాన్' హేం



# విశేషాలు

-జి. వి. జి.

డామ్ నాగార్జునసాగర్, తుంగభద్రా డామ్ అన్నీ మేమే కట్టించాం

"అవును, వీడి తాతగాడి సొమ్ము పెట్టి కట్టించాడు నగ్నసత్యం హేళనగా నవ్వాడు

ఈ దేశంలో ఎన్నో వేల మైళ్ళు రోడ్డు వేయించాం కొన్ని వందల వంతెనలు కట్టించాం కొత్త కొత్త రైలు మార్గాలు కూడా వేయించాం ఇకపోతే ఉక్కు ఫ్యాక్టరీలు, సిమ్మెంట్ ఫ్యాక్టరీలు, ఆటామిక్ ఫాక్టరీలు కొన్ని వందల సంఖ్యలో నిర్మించాం

హుం! వాటిలో వీళ్ళ కమీషనెంతో అడగండి

ఇదివరకటి రోజుల్లో హైదరాబాద్ నుంచి ఢిల్లీ వెళ్లాలీ అంటే – మూడు రాత్రులు మూడు పగళ్ళు పట్టేది మరి ఇప్పుడు? మూడు గంటలు కూడా అక్కర్లేదే?

ఇదివరకు మనిషి భస్మం తగలెయ్యడానికి బండెడు కట్టెలు కావలసి వచ్చేవి ఇప్పుడో – కరెంటుతో అయిదే అయిదు నిమిషాలు

ఈ దేశాభివృద్ధి కోసం మా పార్టీ చేసిన ఘన కార్యాలు చెప్పాలీ అంటే – రోజులు చాలవు నెలలు కావాలి అదొక పుస్తకంగా రాస్తే మహా భారతం కన్నా పెద్ద గ్రంథం అయిపోద్ది ఆఁ!

అవునవును వీళ్ళు సాధించిన ప్రగతి, అభివృద్ధి నేను చూపిస్తాను రండి అని నగ్న సత్యం అనేసరికి ఆ నాయకుని గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లయింది

వేజెళ్ళ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో ఎం ప్రభాకరరావు నిర్మించే త్రిజయవారి ఓటుకి సెలవివ్వండి చిత్రానికి డి వి నరసరాజు సంభాషణల కర్త



జయసుధ, కృష్ణంరాజు, "తిరుగుబాటు"

## లక్ష్మీ చిత్ర హరికృష్ణ చిత్రాలు

బి లక్ష్మి నిర్మాతగా హరికృష్ణ సమర్పించే శ్రీ నికేతన్ ఆర్ట్ క్రియేషన్స్ వారి "దేవాలయం" చిత్రం షూటింగ్ నవంబర్ 18 నుంచి జరుగుతోంది మూడు షెడ్యూల్స్‌లో జనవరికి పూర్తవుతుంది శోభన్‌బాబు, విజయశాంతి, రావు గోపాలరావు, వేలు, వీరభద్రరావు, పి ఎల్ నారాయణ అన్నపూర్ణ ఆదిగా గలవారు నటిస్తున్నారు చక్రవర్తి సంగీతం, గోపాలరెడ్డి ఛాయతో టి కృష్ణ దర్శకుడు

దీ చిత్రంలో హేమమాలిని



"దొంగల్లో దొర", సుమన్, విజయశాంతి





"అందరికంటే మొనగాడు", కృష్ణ, ప్రభాకరరెడ్డి

1985 ఏప్రిల్‌లో శోభన్‌బాబు, శ్రీదేవి జంటతో తయారయ్యే కృష్ణ చిత్ర మందిర్‌వారి శృంగార

సంగీత ప్రధాన చిత్రానికి ఇళయరాజా సంగీత దర్శకుడు గోపాలరెడ్డి ఛాయా గ్రాహకుడు ఏ కోందండరామిరెడ్డి దర్శకుడు మూడు షెడ్యూల్స్‌లో జూన్‌కు చిత్రీకరణ ముగుస్తుంది అనిల్‌బాబు నిర్మాత

ఇవి కాక కృష్ణ, శోభన్‌బాబుతో తాతినేని రామారావు దర్శకత్వంలో ఒక భారీ చిత్రానికి ప్లాన్ చేసినట్లూ, ఏటా రెండు చిత్రాలను సమర్పించ దలచినట్లూ హరికృష్ణ తెలిపారు

## "రౌడీ"లో సన్మానం

పరశురామ్ (కృష్ణంరాజు) ఇంట్లోకి ప్రవేశించ-బో తూండగా గంగ (భానుప్రియ) రక్కున గుమ్మానికి అడ్డం వచ్చింది ఆమెతోపాటు వచ్చిన ఇద్దరు వ్యక్తులు చివాలున పరశురామ్ మెడలో దండలు వేశారు

ఏమిటిది? అన్నాడు పరశురామ్

వీర పుత్రుడికి దండ వేసి హారతి పడతారు అందుకే నిన్ను సన్మానించి నా ఇంటికి భోజనానికి పిలవటాని కొచ్చాను అంది గంగ

"హు! సంస్కారం లేదు సంస్కరణా లేదు నిజాయితీ సంపాదనా లేదు నువ్వు దండలు వేసి

"రౌడీ" భానుప్రియ, కృష్ణంరాజు, శారద



పిలిచినంత మాత్రాన నీ వెంటపడి వస్తాననుకున్నావా?

ఇదిగో అట్టా సూటిపోటి మాట లనమాకు నువ్వు చెప్పిన రోజు నుంచి ఈ రోజు వరకు పొరపాటు పని చేయలేదు ఎందుకని? నీమీద అభిమానం ప్రేమ నిన్ను చూడగానే నాక్కావలసిన వాడివి నువ్వే అనిపించింది నీ కోసం నేను మారాను ఇది నమ్మితే నమ్ము, లేకపోతే లేదు రండ్రా, బ్రదర్స్! అంటూ తనతో వచ్చినవాళ్ళతో వెళ్ళిపోయింది గంగ

ఇంతలో శాంత (శారద) మందహాసంతో వస్తూ పరశురామ్! గంగకు నీ గతం తెలియదు నీమీద మనసు పెట్టుకుంది ఇష్టపడుతోంది నువ్వు కాదన్న రోజున రెండోసారి నీ జీవితంలో విషాదాన్ని చూడవలసి వస్తుంది అంది




విషాదం నా యింటి పేరయింది ప్రతీకారం నా దగ్గర బంధువయింది అలాంటి నాకు ఏ బంధాలు అనుబంధాలు అడ్డు రాకూడదు అంటూ పరశురామ్ వడి వడిగా వెళ్ళిపోయాడు

శాంత నిట్టూర్చింది

ఏ మోహన్ గాంధి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఆట్లూరి తులసీదాస్ నిర్మించిన శ్రీ విజయ రామ కంబైన్స్ రౌడీ చిత్రం త్వరలో విడుదలవుతుంది

## బాలు సంగీత దర్శకత్వంలో చిత్రాలు

భార్యామణి అనంతరం జాకి చిత్రానికి జంధ్యాల దర్శకత్వం వహించే చిత్రానికి, విజయ బాపినీడు నిర్మించే తదుపరి చిత్రానికి, రామోజీరావు త్వరలో ప్రారంభించే చిత్రానికి ఎస్ పి బాల సుబ్రహ్మణ్యం సంగీత దర్శకుడు

# మీ భవిష్యత్తు యొక్క నిర్ణయం జరిగేది మీ పుట్టుకను బట్టా లేక మీ యోగ్యతను బట్టా, దేన్ని బట్టి ?



ఆకలికి కులం ఏమిటి? అన్నం ఏ తెగకు చెందినది? మనం పీల్చే ఊపిరిది ఏం మతం? మరైతే, రోడ్డూడిచే వాడి కొడుకు, అలా చీపురుతో మగ్గిపోవలసిందేనా? రోడ్డూడిచే వాడి కొడుకుగా పుట్టడం అతని తప్పా, అతని గతి అంతేనా?

చరిత్ర చెత్తకుండీల్లోంచి, మూఢ నమ్మకాల కుళ్ళులోంచి, కోరికల సమాధుల్లోంచి, తీరని ఆశల్లోంచి కులతత్వం, అసమానత, దాస్యం, వెట్టిచాకిరీ అనే ప్రేతాత్మలు తలెత్తుతాయి

కులతత్వాలు గల పార్టీలుగా రూపొందుతాయి అవి వాళ్ళకు మనుషులు మనుషులుగా కనిపించరు వాళ్ళకు కనిపించేదల్లా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, రెడ్లు, కాపులు, నాయుళ్ళు, కమ్మవారు, హరిజనులు

అంతేగాని వాళ్ళ కళ్ళకు యీ మనుషులంతా భారతీయులుగా కనిపించనే కనిపించరు ఆ దృష్టితో చూడలేరు వాళ్ళనలా

కొన్ని వర్గాల భారతీయుల్ని బ్రహ్మజెముడు డొంకల్లా వెలివేస్తారు వాళ్ళని ఏమాత్రం వీలుచిక్కినా, అందరికీ అవకాశాల్ని అందించడంబదులు, ఆ అవకాశాల్నన్నీ కొందరి పాలిట జన్మ హక్కుగా చేసి వాళ్ళకే యిచ్చేయ్యాలన్నది వాళ్ళ ఆకాంక్ష

సర్వసమానత్వం, అందరికీ అవకాశాల్ని కల్పించడం, యిది కాంగ్రెస్ (ఐ) యొక్క ప్రగాఢ విశ్వాసం, ఎప్పుడూ మీ భవిష్యత్తును కుల మతాలతో నిమిత్తం లేకుండా తీర్చిదిద్దడం ఎందుకంటారా, కాంగ్రెస్ (ఐ) దృష్టిలో మీరు ప్రప్రథమంగా భారతీయులు అన్ని మతాల్లోంచీ, కులాల్లోంచీ సభ్యులూ, అభ్యర్థులూ గల నిస్సంకోచంగా ధర్మ నిరపేక్షతగల ఏకైక పార్టీ కాంగ్రెస్ (ఐ)

సమాజంలో వెనకబడ్డ వర్గాలు, పీడితులు, యిలాంటి దీనులందరికీ మరిన్ని అవకాశాల్ని కల్పించింది, వాళ్ళ సౌభాగ్యానికి సోపానాలు వేసింది కాంగ్రెస్ (ఐ) మీ ఉద్యోగం, వృత్తి అన్నది మీ కులాల్నిబట్టి గాక మీ యిష్టాయిష్టాల్నిబట్టి నిర్ణయింపబడాలన్నది కాంగ్రెస్ (ఐ) యొక్క విశ్వాసం

మీ విజయం, సాఫల్యం అన్నవి మీ కులాల్నిబట్టి గాక మీ యోగ్యతనిబట్టి నిర్ణయింపబడాలన్నది కాంగ్రెస్ (ఐ) యొక్క విశ్వాసం

మీ భవిష్యత్తునీ, భాగ్యాన్నీ సృష్టించుకునేది మీరు మీరు కూడా కాంగ్రెస్ (ఐ) విశ్వసిస్తూన్నట్లే ఆ సూత్రాలను విశ్వసిస్తే కాంగ్రెస్ (ఐ) కి చేయూతనివ్వండి, మీ వోటు యివ్వండి యోగ్యతకీ, సమానత్వానికీ యివ్వండి మీ వోటు

అసంభవమైన దానిని సంభవం చెయ్యగలుగుతుంది మీ వోటు

అంతటి తేడాని తేగలుగుతుంది మీ వోటు. సమానత్వానికీ, బానిసత్వానికీ మధ్యన గల ఆ తేడాని

కాంగ్రెస్ (ఐ) కి యిచ్చే మీ ఆ వోటు

## సమానత్వమా? బానిసత్వమా? దేన్ని నిర్ణయించేది మీ వోటు.



## సమానత్వానికి చేయూత నివ్వండి.

Issued by Chandulal Chandrakar, General Secretary, A I C C , 24, Akbar Road, New Delhi 110 011 Rediffusion/AICC/3s/TL



"హుషియార్" హిందీ చిత్రంలో
జితేంద్ర, మీనాక్షి శేషాద్రి

## దాసరి నాయకుడుగా, దర్శకుడుగా జగపతి రాజేంద్ర ప్రసాద్ చిత్రం "లంచావతారం"

నేటి సమకాలీన సమాజంలో లంచానికున్న ప్రాధాన్యతను వివరించే వి సుందరం సమకూర్చిన హాస్య కద ఆద్యంతం నవ్విస్తుంది నా కిదొక వెరైటీ పాత్ర అన్నారు దాసరి నారాయణరావు ఈయన స్క్రీన్ప్లే, సంబాషణలు సమకూర్చి, దర్శకత్వం వహించే జగపతి ఆర్ట్ పిక్చర్స్ లంచావతారం చిత్రంలో ఈయన సరసన సుజాత నాయిక జగ్గయ్య సురేష్, అల్లు రామలింగయ్య నాగేష్ సారధి, మాడా వి ఎల్ నారాయణ, నవ నటి రజని పాల్గొంటారు కె వి మహదేవన్ స్వరకల్పనలో ఆత్రేయ పాటలు రాశారు సెల్వరాజ్ చాయ కె ఎల్ ధర్ శిల్పం, సంజీవి కూర్పు నిర్వహిస్తారు "నవంబర్ డిసెంబర్‌లలో 21-30 తేదీల మధ్య జనవరిలో 11నుంచి 20 వరకు మద్రాసులో జరిగే మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు నిర్మాత వి బి రాజేంద్ర ప్రసాద్ ఈ చిత్రానికి డిమిట్రావ్ ప్రభాకర్ సహ దర్శకులు సులేమాన్, రాజు ప్రొడక్షన్ నిర్వహిస్తారు

## "దర్జా దొంగ"

బాల్యంలో అల్లరి పనులు చిల్లర దొంగతనాలు చేస్తూ, పెద్ద వాతయ్యాక సమాజంచేత దర్జా దొంగగా చిత్రీకరింపబడిన ఓ యువకుడు – దొంగతనాలు మాని గౌరవంగా బతకాలని దృఢంగా నిర్ణయించుకుంటాడు అయితే, విచిత్రమైన పరిస్థితిలో అతనిమీద అన్యాయంగా హత్యానేరం మోపబడుతుంది అరెస్టవుతాడు ఆ తర్వాత కథ అనూహ్యమైన మలుపులు తిరుగుతుంది ఈ పాత్రను సుమన్ అసమాన చాతుర్యంతో నటిస్తున్నాడు హాలీవుడ్ చిత్రాలకు దీటుగా టెర్రర్‌కి, సస్పెన్స్‌కి ప్రాధాన్యత ఇస్తున్నాం నన్ను తెలుగువారికి పరిచయం చేస్తున్న శ్రీ విజయలక్ష్మి ఆర్ట్స్‌వారికి, నిర్మాత ఆర్ రామకృష్ణంరాజుగారికి, సహ నిర్మాత కె రామరాజుగారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను, అన్నారు డైరెక్టర్ మణివణ్ణన్ దర్జా దొంగ చిత్రానికి నవంబర్ 1 నుంచి 15 వరకు ఊటిలో అయిదు పాటలు కొన్ని కీలకమైన సన్నివేశాలు చిత్రీకరింపబడ్డాయి

మణివణ్ణన్ దర్శకత్వంలో ఎస్ బావన్నారాయణ నిర్మించే 'ఖూనీ చిత్రం నవంబర్‌లో మొదలవుతుంది

## ఎస్. రామచంద్రరావు దర్శకత్వంలో ఎస్. ఎల్. ఎస్. మూవీ క్రియేషన్స్ తొలి చిత్రం

"దేశ రక్షణ కోసం ఆహర్నిశలు పోరాడుతున్న సైనికుల కుటుంబాలకు మనం ఎంతవరకు రక్షణ ఇవ్వగలుగుతున్నాం అనే అంశంమీద అల్లబడిన నవ రస భరితమైన కథ మొదటి సగమంతా మిలిటరీ బాక్‌గ్రవుండ్‌లోనూ, రెండవ సగమంతా ఫారెస్ట్ బాక్‌గ్రవుండ్‌లో చిత్రీకరిస్తున్నాం కమేండోగా భానుచందర్, మేజర్‌గా గిరిబాబు నటిస్తున్నారు అన్నారు ఎస్ రామచంద్రరావు ఈయన దర్శకత్వం వహించే పై సంస్థ చిత్రంలో అశ్విని, సంయుక్త, ప్రభాకరరెడ్డి, సుధాకర్, ఈశ్వరరావు, రాజేంద్ర ప్రసాద్, కమలాకర్, హరిబాబు, పి జె వెంకటేశ్వరరావు, రాజ్ వర్మ, నటిస్తున్నారు ఆరుద్ర కథకుడు కొంపెల్ల విశ్వం సంభాషణ కర్త జె వి రాఘవులు స్వర కల్పనలో ఆరుద్ర, వేటూరి, గీతాలు రాశారు ఎస్ ఎస్ రాజు ఛాయ, రంగారావు శిల్పం, సాంబశివరావు కూర్పు సత్యం ప్రొడక్షన్, విక్రమ్ సహకార దర్శకత్వం, వెలగపూడి చంద్రశేఖర్ నిర్వహణతో సతీష్ కుమార్ సహ నిర్మాత నవంబర్ 20 నుండి డిసెంబర్ 5 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది అన్నారు నిర్మాత లంక వెంకటేశ్వర్లు □

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క
నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు
తునకల్లో దుర్వాసన,దంతక్షయం కలిగించే
సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ
లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన
కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని
కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు
తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన,
తాజా శ్వాస, దాంతోటే దృఢమైన,
ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా
కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి
నోటి దుర్వాసన పోగొట్టుకోండి దంతక్షయాన్ని ఎదుర్కోండి.
వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!

# పాలమ్ని జెరి

## గౌతముని భార్య కావడానికి సజీవ సమాధి!

చైనా బైజింగ్‌కుచెందిన 74 ఏళ్ళ షెన్‌క్సియాంగ్ అనే ఆమె తాను సజీవ సమాది అయి, చనిపోయి గౌతమ బుద్ధుణ్ణి వివాహం చేసుకోదలచినట్టు తన 52 ఏళ్ళ కొడుకు ఝూంగ్ జియాపు, 33 ఏళ్ళ కొడుకు ఝుంగ్ జియాయులకు చెప్పి వొప్పించి తన నొక శవపేటికలో పెట్టి మూయించేసుకున్నదట ఆవిడ కోరిక ప్రకారం వారు బంధు మిత్రులకు విందులు చేసి యదాశాస్త్రంగా ఆ శవ పేటికను స్మశానానికి తీసుకు వెళ్తుంటే పోలీసులొచ్చి పెట్టి పగలేసి ఆవిణ్ణి రెక్క పుచ్చుకులాగి ముఖం వాచేలా ఆ ముగ్గుర్నీ పడ చీవాట్లేశారట అప్పటికీ ఆ ముసలావిడ తాను అలా చేస్తే గౌతమ బుద్ధుని బార్య నవుతానని ఆ శవపేటికమీద గుద్ది మరీ చెప్పిందట

## సముద్రంలో అంత్యక్రియలు!

పశ్చిమ జర్మనీలో వల్లకాడుగా సముద్రాన్నే వాడుతున్నారట మెడిటరేనియన్ సముద్రంలోను నార్త్ సముద్రంలోనూ శవాలను పడెయ్యటానికి చిన్న ఓడలు కూడా వున్నాయట ఆ వోడలలో శవాలను సముద్రంలో కొంతదూరం తీసుకపోయి అక్కడ గిరాట వేస్తారట–గుడ్ అయిడియా

## ఊరగాయలు చెడిపోని పాత్రలు!

ఊరగాయల వంటివి చెడిపోకుండా ఎన్నేళ్ళయినా వుండేలాగ (పచ్చళ్ళు కూడా నన్నమాట) అమెరికా-




లోని ఒక సంస్థ గామా అనే వో రకం ప్లాస్టిక్ పాత్రలు కనిపెట్టి తయారు చేస్తోందట ఈ పాత్రలలో పెట్టిన ఊరగాయలు ఎన్నేళ్ళయినా చెడిపోవట

## భార్య హత్యకి దారితీసిన ఆలుమగల తగాదా!

కర్నూలు పెద్ద మార్కెట్టు వద్ద చెప్పులు కుట్టుకుని జీవనం చేస్తున్న ఒకతని బార్య నాగమ్మ అతనితో పోట్లాడి దీపావళి ముందు తన పుట్టింటికి వెళ్ళి పోయిందట దీపావళి నాడు భార్యను యింటికి ...లుచుకు రాడానికి అతను తన అత్తింటికి వెళ్ళేసరికి తాను వచ్చేది లేదని చెప్తూ పండక్కి తనకని కొన్న చీర తెచ్చి యిచ్చేయమని అనేసరి కాతనామెను పది తిట్లు తిట్టాడట దానికామె విజృంబించి పందలు కొద్దీ తిట్టేసరి కతను కత్తితో ఆమె పీకమీద తీవ్రంగా గాయ పరచాడట ఆసుపత్రికి వెళ్ళే దారిలో ఆమె చనిపోయిందట

## విరక్తి – ఆత్మహత్య

వేలూరులో మున్సిపాలిటీలో పని చేస్తున్న వేలాయుదం అనే అతను తాను సంపాదించిన సొమ్మంతా సుబ్బరంగా త్రాగి, యింటికి వెళ్ళి, బార్య 26 ఏళ్ళ ఉమను గొడ్డుకన్నా హీనంగా బాదేవాడట పదేళ్ళ తనకాపురంలో ఏ నాడూ సుఖమెరగని ఆ ఉమ తన 9 ఏళ్ళ కూతురు కళైవాణికి, 6 ఏళ్ళ కూతురు లతకు గచ్చ పప్పు తినిపించి తానూ తినేసి, మరణాన్ని ఆహ్వానించిందట ముగ్గురూ మృత్యువుతో పోరాడుతున్నారట దిక్కుమాలిన వేలాయుదం ఎక్కడో పార్లాడు తూంటాడు!

## యం.జి.ఆర్. కోసం ఆత్మాహుతి!

తమిళనాడు ముఖ్యమంత్రి యం జి ఆర్ ఆరోగ్యం నానాటికీ తీసిపోతోందని ఆయన బ్రతకడేమోనని అనుకుని ఏడ్చి ఏడ్చి కేరళ వందన్‌మేడులో యాలక తోటలో పని చేసే 32 ఏళ్ళ రాజప్పన్, ఆతని బార్య 25 ఏళ్ళ మారియమ్మ విషం త్రాగి ఆత్మ హత్యకు పూనుకున్నారట ఇరువురూ ఆసుపత్రిలో విషమ స్థితిలో వున్నారట పరిమళ అనే 26 ఏళ్ళ అమ్మాయి మద్రాసులో మీద కిరసనాయిలు పోసుకుని ఆత్మహత్య చేసుకున్నదట ఇదే విషయం మీద చాలామంది ఆత్మ హత్య చేసుకున్నారు

## మోసపోయిన యువకుని ఆత్మహత్య!

తంజావూరుకు చెందిన బాస్కరన్ అనే వో యువకుడు మద్రాసులో ఏ నటుని ఇంట్లో నయినా పని చేసుకుని బ్రతుకుదామని మద్రాసు వచ్చి అక్కడ నటీ నటుల యింట్లో దొరక్క హోటళ్ళలో కూడా దొరక్క, దానికితోడు వో వ్యక్తిచేత మోస పోయి వున్న 165 రూపాయలూ అత నెత్తుక్కుపోయేసరికి జీవితం మీద రోసి రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకున్నాడట ఈ వివరమంతా వో ఉత్తరంలో రాసి జేబులో పెట్టుకున్నాడట

## అన్ని భాషలలో నటి రాధకి అరువు గొంతే!

తెలుగు తమిళమూ రాదు కనుక ఆ బాషలలో ఆమెకు గొంతు డబ్ చేస్తారు కానిరాద ఇంత వరకూ మళయాళంలో కూడా తన సొంత గొంతుతో సినిమాలో మాట్లాడలేదట తాను నటించిన ఏ చిత్రంలోనూ తనది డబ్బింగ్ గొంతేనట మొట్ట మొదటిసారిగా ఓ హిందీ చిత్రంలోతన సొంత గొంతుతో మాట్లాడుతోందట– చిత్రం!

## తన కోపమే....

వేలూరు రిజర్వు ఆర్మీకి చెందిన 40 ఏళ్ళ ఆర్ముగం అక్టోబరు 26వ తేదీ మధ్యాహ్నం భోజనానికి యింటికి వెళ్ళి పదవక్లాసు చదువుతున్న కొడుకు సెందిల్ కమారు ఏడని భార్య కన్నమ్మ నడిగితే యింకా రాలేదన్నదట పిల్లలు సరిగ్గా చదివి చావటం లేదని నువ్వు కాస్త వాళ్ళకి భయం చెప్పి చావటం లేదని భార్యని తిట్టి అంతతో ఆగక ఆమెను చితకబాది అప్పటికీ ఆవేశం తగ్గక చిన్న పిల్లల్ని చావబాది, అయినప్పటికీ కోపావేశాలు యింకా ఎక్కువవడం వల్ల స్వరునాతన మీద కిరసనాయిలు పోసుకు నిప్పంటించేసుకున్నాడట

## నీడ పడని ఆలయ గోపురం!

తంజావూరు బృహదీశ్వరాలయ గోపురం 58 మీటర్సు ఈ ప్రదాన గోపురం మీది కలశంతో వే



బస్తా వొడ్లు పడ్తాయట ఈ కలశం అంత పెద్ద దన్నమాట దీనినీడ భూమ్మీద పడదు

## గాంధీ మార్గం!

గుజరాత్‌కు చెందిన దీనూభాయ్ పటేల్ అనే ఆయన వైద్య విద్యలో (యం బి బి యస్) పట్టా తీసుకుని లండన్ డబ్లిన్, వియన్నా వంటి నగరాలలో వైద్య ఉన్నత విద్య నభ్యసించి స్వదేశానికి తిరిగి వచ్చి దేగాన్ అనే వో చిన్న వూరిలో ప్రాక్టీసు పెట్టి బీద బిక్కలకు ఉచిత వైద్యం చేస్తున్నారట తాను ఖద్దరు ధరించడమేగాక సంవత్సరానికి తనకు కావలసిన బట్టకు కావాల్సిన దారాన్ని తానే రోజూ వొడుకుతారట- లివింగ్ గాంధి నియన్ ఆన్ ఎర్త్! య్యా ☐

# మరి 1977 లో ఒకే మూసలో ఏకమైన వాళ్ళు పదవీ వ్యామోహం వల్ల కాకుండా ఒకే ఆదర్శంకోసం యిక ఏకమవుతారనా?



పై ముసుగు ఏదైని గుర్తు పట్టెయ్యొచ్చు
ఆ ముసుగుల్ని వాళ్ళు మార్చేస్తూవుంటారనుకోండి
ఆదర్శాల రీత్యా వాళ్ళకి ఉత్తర దక్షిణ ధృవాలంత దూరం
కలిసి మెలిసి ఉండలేని అగంతకులు వాళ్ళు

ఎన్నికలకీ ఎన్నికలకీ గల మధ్యకాలంలో వాళ్ళ వాళ్ళ పార్టీ సమావేశాలు జరుపుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతారు—విడిపోదామనేవారి వాదాలను సమర్థిస్తూనో లేదా దేనివల్లయినా వోట్లు పోతాయేమోననే అనుమానం కలిగినప్పుడు దేనినీ సమర్థించకుండా, వ్యతిరేకించకుండా అలా మౌనంగా ఊరుకుంటారు

లేదా అలా ఏమి తెలియనట్టు దూరంగా తప్పుకుంటారు
ఇక ఎన్నికలు వస్తున్నాయంటే చాలు, చటుక్కున లేస్తారు వీళ్ళు
ఒకళ్ళ నొకళ్ళు పట్టుకుని పాకులాడతారు

మరి వాళ్ళు కలుసుకుని వున్నంత మాత్రాన, వాళ్ళు నిజంగా ఒకటైనట్టేనా?

లేదా పాత శత్రు కూటంలోని వాళ్ళు, ఒకళ్ళ మెడలో మరొకళ్ళు దండలు వేసుకుని, కరచాలనం చేసి, ప్రజలకి సర్వసమన్వితమైన కార్యక్రమాన్ని అందించే బదులు, అందరికీ కనిపించేలా కలిసి కెమేరాకోసం ఒక చిరునవ్వు విసురుతున్నారా?

ఏమైనా సరే చేయడానికి సిద్ధపడి ప్రభుత్వంలోకి రావడానికి ప్రయత్నించినా, వీళ్ళు అసలు సర్వసమన్వితమైన ఒక ఉమ్మడి సిద్ధాంతాన్ని, విధానాల్ని రూపొందించగలుగుతారా?

ఇదంతా ఒక చవకబారు నాటకం
మీరు 1977 ని ఎలా మరచిపోగలరు గనక

మీకు తెలుసు—పదవుల్లోకి రాగానే వాళ్ళు చేసిందేమిటి—కాళ్ళు పారజాపుకుని ఎవరు ఎంతకాలం పదవిని అధిష్ఠించాలా అన్న విషయంపై ఎరస్పరం ఘర్షణ పడటం తప్ప

1977 నాటి ఆ మూస, ఆ చక్రం గిర్రున తిరిగివచ్చింది 1984 లో
అవే ముఖాలు అవే మనస్తత్వాలు అదే అసంతృప్తి
మరి ఆ చవకబారు నాటకాన్ని చూస్తారా మళ్ళా మీరు?

కాంగ్రెస్ (ఐ) ఎప్పుడూ ఒక సిద్ధాంతంపై నిలబడింది, వాళ్ళకి, సమ్మతమైన ఒక వేదిక వుంది, ప్రజల హితం వారి హృదయంలో వుంది

అంతేకాదు, వీటన్నిటినీ క్రియా రూపంలో పెట్టి చూపించారు
కాంగ్రెస్ (ఐ) సమైక్యమైన పార్టీగా నిలబడింది ఎప్పుడూ

చరిత్రలోకి ఎక్కిన బాధ్యతాయుత ప్రజాసేవ, కార్యక్రమాలు, సిద్ధాంతాలు, సూత్రాలు, ఆదర్శాలతో

అట్టి సుసంఘటితమైన సమైక్యమైన పార్టీ మాత్రమే అభివృద్ధికి, మరింత మెరుగైన జీవితానికి, విద్యా సౌకర్యాలకి, ఆరోగ్య సంపదకి, మరింతగా అవకాశాలను కల్పించడానికి, వీటన్నిటికి దోహదం చేయగల కార్యక్రమాలకు ప్రణాళికలు వేసి వాటిని అమలులో పెట్టగలదు

అంతటి తేడాని తేగలుగుతుంది మీ వోటు
ఆదర్శానికి, పదవీ వ్యామోహానికి మధ్యన గల ఆ తేడాని తేగలుగుతుంది
కాంగ్రెస్ (ఐ) కి యిచ్చే మీ ఆ వోటు

## ఆదర్శమా? అవకాశవాదమా? దీన్ని నిర్ణయించేది మీ వోటు.



## ఆదర్శానికి చేయూత నివ్వండి.

Issued by Chandulal Chandrakar, General Secretary, A I C C , 24, Akbar Road, New Delhi 110 011 Rediffusion/AICC/4s/TL R

# ఎదవీణ మ్రోగిన వేళ

సీరియల్ "కృష్ణజ"

(గత సంచిక తరువాయి)

పండుగ తరువాత మరో నాలుగు రోజులుండి వెళ్లిపోయారు స్వాతి – ఆనంద్

తల్లి కూతుర్ని మరో పదిరోజులు ఉండి వెళ్లమని బలవంతం చేసింది కానీ, ఆనంద్ ఒప్పుకోలేదు స్వాతి ఇష్టపడలేదు మళ్లీ త్వరలోనే వస్తామంటూ వెళ్లిపోయారు

దీపావళి వెళ్లి ఇరవై రోజులు కావస్తోంది దీపావళి ప్రత్యక్షమైన మార్పులు ఏవీ తెచ్చినట్లు కనిపించకపోయినా, మానసికంగా అనూహ్యమైన మార్పునే తెచ్చింది సాకేతలో

స్వాతీ – ఆనంద్‌ల ఆనందపు జల్లులు కురిసి తడిసిన ఆమె హృదయం భర్త ప్రేమామృతంలో మునకలు వేసేందుకు సిద్ధంగా ఉంది

కళ్లల్లో అనురాగంతో పాటు, హృదయంలో కోరిక చోటు చేసుకోగా భర్త సన్నిధి కొరకు పరితపించసాగింది

కూతుర్ని చూసేందుకు అత్తగారూ, మామగారూ విజయవాడ ప్రయాణం కావడం ఆమె తనకో అవకాశంగా సంతోషించింది వీలయినంతగా భర్త కనుసన్నలలో మెలిగేందుకూ, చిన్న చిన్న ఉపచారాలతో సన్నిహితం అయ్యేందుకూ ప్రయత్నించింది సిగ్గును ప్రక్కకు నెట్టి చొరవ తీసుకున్నా, ఆ వారం రోజులలోనూ "ఊఁ " "ఆఁ " "వద్దు " "చాలు" "సరే " నాకు వీలవదు " "నువ్వెళ్ళు " "చెప్పడంలా నాకు కుదరదని " వంటి పొడి మాటలు తప్ప మరో మాటనుగానీ, సన్నిహిత్త్వాన్నిగానీ, కనీసమైన స్నేహాన్నిగానీ అతన్నుండి పొందలేకపోయింది సాకేత

ఉదాసీనంగా, ముభావంగా, ముక్తసరిగా, కఠినంగా ఉండే అతని ముఖాన్ని చూస్తూ మరో అడుగు కూడా ముందుకు వేయలేకపోయింది

క్షణం కూడా వదిలి ఉండలేనట్లున్న స్వాతీ – ఆనంద్‌ల జంటలోని స్వాభావికత తమ జంటలో లేకపోవడానికి, ప్రథమంలో తన ఉదాసీనతే కారణం అనుకున్న సాకేతకు అంతకు మించి మరో కారణం ఉందనే విషయం అర్థమయ్యింది

**జరిగిన కథ 6 : స్వాతి, ఆనంద్‌ల పరస్పరానురాగం చూసి తామూ అలాగే ఉండాలని కోరుకుంటుంది సాకేత. మాధవ్ ప్రవర్తన ఆనంద్‌కు వింతగా తోస్తుంది.**

ఆయనకు తనంటే ఇష్టం లేదా ?

ఇష్టం లేకుండానే పెద్దవాళ్ల వత్తిడి మూలంగా తనను వివాహం చేసుకున్నారా ? తనలాగే పెళ్లికి ముందే ఎవరినైనా ప్రేమించి ఉంటారా ?

ఆ ప్రేమ విఫలమై ఉంటుందా ?

జవాబు దొరకని అనేకానేక ప్రశ్నలతో సతమత మయ్యింది

రాత్రి పది గంటలయ్యింది

ఉదయం పదిగంటలకు షాపుకు వెళ్లిన భర్తకోసం ఎదురుచూస్తూ కూర్చుంది

ఆయనకు తానెందుకు గుర్తుకు రాదో సాకేతకు అర్థం కాదు మరో గంట గడిచాక మాధవ్ ఇల్లు చేరుకున్నాడు అతనికోసం తను మేలుకుని ఉండాలనిగానీ, స్నానానికి నీళ్లు తోడాలనిగానీ బోజనం వడ్డించాలనిగానీ అతను సాకేతను కోరడు వేధించడు

అయినా సాకేత అతను వచ్చేవరకూ మేలుకుని ఉంటుంది స్నానానికి నీళ్ళు తోడుతుంది భోజనం వడ్డిస్తుంది నువ్వు తిన్నావా ? అనే మాట అతని నోట ఎప్పుడూ రాదు అతనితో కబుర్లు చెప్పాలనీ, అతను చెప్పే కబుర్లు వినాలనీ ఆపేక్ష పడుతుంది సాకేత

వద్దు ' "వెయ్యి "చాలు" "ఊహుఁ అనే మాటలు తప్ప మరో మాట అదనంగా రాదు మాధవ్ నోటినుండి

ఇది ఇలా ఎందుకు ? ఏమిటి ? అనే ప్రశ్న రాదు అతని నుండి అతను తన పనులు తానే చేసుకుంటాడు

ఎవరినీ పిలవకుండానే భోజనం కూడా వడ్డించుకుంటాడు అతని ప్రవర్తనవల్ల ఎవరికీ బాధ లేదు

కానీ, మానసికంగా అతని భార్యగా మారినప్పటినుండీ ఆ ప్రవర్తన సాకేతను బాధపెడుతోంది

పరధ్యానంగా నిర్లిప్తంగా ఉన్న అతని వైఖరి ఆమెకు దిగులు కలిగిస్తుంటుంది

భోజనం ముగించి అలసి పోయినట్లు ప్రక్క చేరాడు మాధవ్

అతని వెనకే గదిలోకి వచ్చి, అతనికి వక్క పొడి అందించింది

మాధవ్ తాపీగా సిగరెట్ వెలిగించాడు

గదిలో అగరు వత్తుల పరిమళం మత్తుగా వెండి వెన్నెల చల్లగా పిల్ల తెమ్మెర హాయిగా పడక తెల్లగా

సాకేత భోజనం పూర్తి చేసుకుని, మంచి నీళ్ళు తీసుకుని గదిలోకి వచ్చేసరికి అతను నిశ్చింతగా నిద్ర పోతున్నాడు

సాకేత మనస్సు నిరాశగా నిట్టూర్చింది

నిరాశ కన్నీరుగా మారి కళ్ళను తడిపింది

వెండి వెన్నెల చల్లగాలి మల్లెపూలు ఇస్త్రీ చీర అన్నిటినీ మించి అనురాగంతో దరిజేరబోతున్న భార్య ఇవేవీ అతన్ని కదిలించలేక పోతున్నందుకు ఆశ్చర్యపోయింది

భర్తకు విఫలమైన ప్రేమ గతం ఉందనే విషయం మాత్రం ఆమె పూరిగా విశ్వసించింది

కానైతే అతన్ని తన వాడిగా చేసుకునేందుకు తానేం చేయాలో మాత్రం అర్థం కాలేదు

మూలనున్న చాప పరచి దిండు వేసుకుని నడుం వాల్చింది

అలా అనేక రాత్రులు తెల్లవారాయి కానీ, దీపావళి వెళ్ళినప్పటినుండి ఆమె పొందుతున్న నిరాశ అంతక్రితం ఎప్పుడూ పొందలేదు

వారం రోజులుగా ఆమెకు పగలూ – రాత్రీ ఇదే ధ్యాసగా మారింది ఇంతగా ఆలోచించేందుకుగానీ, బాధ పడేందుకుగానీ అప్పట్లో ఆమెకు అసలు తీరిక ఉండేది కాదు

తీరిక విశ్రాంతి స్వేచ్ఛ ఆమెలో ఆనందాన్ని నింపేందుకు బదులుగా నిరాశనూ, వేదననూ రగిలించాయి

"ఏమిటీ జీవితం ? అనుకుంది విరక్తిగా



'కనీసం ఒక స్నేహితుడుగా నైనా అతడు తనతో మసలుకోకూడదూ ? అతని కిష్టం లేకపోతే తను పైన బడి అతన్ని రేప్ చేయదుగా ? ఎందుకంత భయంగా, దూర దూరంగా పారిపోవడం తన నుండి అనుకుంది బాధగా

* * * * *

ప్రకృతిపైన మంచు తెరలు తెరలుగా మేలి ముసుగు కప్పుతోంది ముంగిళ్ళల్లో ముత్యాల ముగ్గులు బంతి పూలూ వణికించే చలి గాలులూ సంక్రాంతి లక్ష్మికి స్వాగతం పలుకుతున్నాయి

దొడ్లో పూచిన బంతి మొక్కల వైపు చూస్తూ కూర్చుంది సాకేత

"అమ్మాయ్ మీ అత్తగారు బాగా చూసుకుంటుందా ?"

కూతురి దగ్గరే కూర్చుని సాయంత్రం వంట కోసం చిక్కుళ్ళు వలుస్తున్న రాధమ్మగారు కుతూహలంగా అడిగారు

రాధమ్మ కూతుర్ని వదిలి ఉండలేనట్లు సాకేత చుట్టూ చుట్టే తిరుగుతుంది వదలకుండా

## ఎదవీణ మ్రోగిన వేళ...

"మాట్లాడవేమే మీ అత్తగారు బాగా చూసుకుంటుందా ?"

ఆఁ

"అల్లుడుగారు ప్రేమగా ఉంటారా ?

"ఆఁ "

"ఇద్దరూ కలిసి సినిమాలకు వెడతారా ?

"ఆఁ "

ఏం సినిమాలు చూశావు ?"

"ఉహూఁ ఈమధ్య ఏమీ చూడలేదు

మీ మావఁగారు

"అబ్బబ్బ అమ్మా! అందరూ నన్ను ప్రేమగానే చూసుకుంటారు సరేనా?"

ఎందుకే అంత విసుగూ నువ్వెలా గున్నావోనని ఇక్కడ నా ప్రాణం ఎంత కొట్టుకు పోతుందో నీకేం తెలుసు ?

సాకేతకు జాలి వేసింది

నిజమే తల్లి ప్రాణం

అమ్మా! పార్వతమ్మ అత్తయ్య వాళ్ళింట్లో అందరూ బావున్నారా ?" అంది విషయం మార్చి

"ఆఁ వాళ్ళకేం బాగానే ఉన్నారు

"కరుణకు సంబంధాలు చూస్తున్నారా ?"

"ఏమోనమ్మా మనకేం తెలుస్తుందీ "

"అందరూ బావున్నారా ?

సాకేత ఏదో అడగలేక ఏదో అడుగుతుంది ఆ విషయం రాధమ్మ స్త్రీ హృదయానికి అర్థం అవుతూనే ఉంది

ఈ పిల్ల ఇంకా శ్రీధర్ ను మరిచి పోలేక పోతుందా? దిగులుగా అనుకుంది రాధమ్మ

పెళ్ళయిన పిల్ల కుండాల్సిన చురుకుదనంగానీ, ముఖంలో ఆనందం, తృప్తి ఇవేవీ సాకేతలో ఆమెకు కనిపించలేదు

అమ్మాయ్! మీ ఆయన మీ అత్తగారు "

ఆమె మాట పూర్తి కాకుండానే అంది సాకేత, అమ్మా! ఎప్పుడూ అత్తగారి భజనేనా మన ఇంటి విషయాలు చెప్పేదేమయినా ఉందా ? సాగర్‌కు ఈ సంవత్సరంలో చదువై పోతుందిగా ఏం చేద్దామనుకుంటున్నారు ?"

రాధమ్మ ఏదో చెప్పింది

కానీ, రాధమ్మకు మాత్రం ఓ విషయం అంతు పట్టకుండా ఉంది పెళ్ళయిన పిల్లలు ఎంత సేపూ అమ్మా! మా ఆయన అలాగ ఆయన అది తింటారు ఇది తింటారు అలా అన్నారు ఇలా అంటూ మాటకు ముందూ 'అత్తవారింటి కబుర్లే చెబుతుంటారు మరి ఇదేం పిల్ల ?ఆ మాటే ఎత్తదు

మొత్తంమీద సాకేత అత్తగారింట్లో సుఖంగా ఉంటోందో లేదో మాత్రం ఆమె నిర్ణయించుకోలేక పోయింది

ఎన్ని ప్రశ్నలు వేసినా ఆఁ ఊఁ అనే సమాధానాలు తప్ప మరోటి చెప్పించలేక పోయింది సాకేతతో

కన్న తల్లిని నాకే అర విడిచి చెప్పకపోతే ఇంకెవరికి చెప్పుకుంటుందీ పిల్ల అనుకుంటూ తల కొట్టుకుంది రాదమ్మ

రాజారావుగారు వెళ్ళి దీపావళికి అల్లుడ్నీ – కూతుర్నీ తీసుకు రాలేక పోయినందుకు బాగా నిరాశ చెందింది రాధమ్మ

పండుగ మూడు రోజులూ కంట తడి పెడుతూనే గడిపింది అప్పటినుండీ నిముషం ఒక్క యుగంలా గడిపి సంక్రాంతి కోసం ఎదురు చూసింది

సంక్రాంతి ఇరవై రోజులు ఉందనగానే ఈసారి తానే సాకేత అత్త వారింటికి ప్రయాణమైంది

భర్తను పంపితే సాకేత అత్తగారు మళ్ళా పంపను అంటుందేమోనని భయం ఆమెకు







# ఎదవీణ మ్రోగిన వేళ

వియ్యపురాలిని చూస్తూనే జానకమ్మ మొహం మాడిపోయింది ఆమెకు సాకేతను పుట్టింటికి పంపడం ఇష్టం ఉండదు కానీ, ఆ విషయం రాజారావుగారితో అన్నంత తేలికగా వియ్యపురాలితో అనలేక పోయింది

అల్లుడు మాత్రం "నాకు వీలవదు మీ అమ్మాయిని తీసుకెళ్ళండి అనేశాడు క్లుప్తంగా

రాధమ్మకు మరోమాట మాట్లాడేందుకు కూడా అవకాశం ఇవ్వకుండా షాపుకు వెళ్ళిపోయాడు

ఇదంతా ఏమిటో గా అనిపించింది రాధమ్మకు

అల్లుడూ – కూతురూ మాట్లాడుకోగా ఆమె ఒక్కసారి కూడా చూడలేదు అల్లుడూ – కూతురూ చిలకాగోరంకల్లా తన కళ్ళ ముందు నాలుగు రోజులు గడుపుతే కళ్ళారా చూడాలనే ఆమె ఆశకు పురిటిలో నే సంధి కొట్టినట్లయి, కూతుర్ని మాత్రం తీసుకుని ఇంటికి వచ్చింది కూతురి జవాబులు బట్టి భార్యా భర్త లిద్దరూ అన్యోన్యంగా ఉంటుందీ, లేనిదీ అర్థం చేసుకోలేక పోయింది

అప్పుడే మొదటి సారిగా ఆమెకు, "సాకేత శ్రీధర్‌ను మరిచి పోలేక పోతుందా ?" అనే అనుమానం కలిగింది

"భగవంతుడా నా పిల్ల బ్రతుకు సుఖమయం చెయ్యి కనిపించని దైవానికి చేతులెత్తి మ్రొక్కుకుంది రాధమ్మ

* * * * *

జానకమ్మ ఆనందానికి పట్ట పగ్గాలు లేకుండా పోయాయి ఆమె కాలు నేలమీద ఆగడం లేదు

ఎప్పుడెప్పుడు ఈ కమ్మని కబురు తన కాలక్షేప మిత్రురాంగ్ర చెవిలో వేసి వారి అభినందనలు అందుకుందామా అన్నంత ఆత్రంగా ఉంది ఆమెకు

ఆమె అంతరాంతరాలలో ఆమెకే స్పష్టంగా తెలీని మరో కోరిక కూడా ఉంది

తన అదృష్టానికి ప్రక్కింటి విమలమ్మా, కాంతం అసూయ పడుతుంటే సంతోషంగా నవ్వుకోవాలన్నదే ఆ కోరిక

అందుకే ఇంట్లోకీ బయటికీ తచ్చాడింది కానీ, అది పని వేళ పని మానుకుని నలుగురూ ఒక చోట చేరే సమయం కాదు అథవా పిలిచినా, "నీకేమమ్మా, కోడలు కాలు కందకుండా చేసి పెడుతుంటే తీరి కూర్చుని కబుర్లు చెబుతావు మా కలా కాదే ఇంటెడు చాకిరీ చేసుకోవాలి " అని సాగతీస్తారు "

అందుకే ఆ కాసేపూ తన సంతోషాన్ని కోడలితో నే పంచుకునేందుకు ప్రయత్నించింది

ఉదయపు భోజనాల తరువాత ఇల్లు శుభ్రం చేస్తోంది సాకేత

సత్యా! ఈ సంగతి విన్నావుటే ?

"ఏమిటత్తయ్యా ?

"స్వాతి ఉత్తరం వ్రాసిందే

ఏం వ్రాసిందత్తయ్యా ? చేస్తున్న పని ఆపి కుతూహలంగా అడిగింది సాకేత

"ఆ మాట విన్నప్పటినుండీ నా గుండె తెనె కుండే అయ్యిందనుకో నా తల్లి ఎలా ఉందో చూసి ఎన్నాళ్ళయి పోయిందో

"ఏం మాట అత్తయ్యా ?

"స్వాతి నెల తప్పిందటే అల్లుడుగారు ఉత్తరం వ్రాశారు "

"నిజంగానా అత్తయ్యా ఎంత సంతోషమైన మాట

ఆనందంతో సాకేత ముఖం వికసించింది

"ఎప్పుడెప్పుడు చూస్తానా నా తల్లిని అని ప్రాణం కొట్టుకు పోతుందనుకో

"నాకూ స్వాతిని చూడాలని ఉందత్తయ్యా మీరు వెళ్ళి తీసుకొచ్చే-గూడదూ "

"వాళ్ళు పంపొద్దూ ? అసలే అల్లుడుగారు దాన్ని ఒదిలిపెట్టి క్షణం కూడా ఉండలేరు

అల్లుడూ – కూతురీ అన్యోన్యతకు మురిసిపోతూ అంది జానకమ్మ

"పిల్ల ఎలా ఉందో నాలాగే అయితే దానికీ వేవిళ్ళు ఎక్కువే ఉంటాయి ఏవో నాలుగు రకాలు అవీ ఇవీ చేసుకు వెళ్ళాలి "

"స్వాతికి గులాబ్‌జాం అంటే ఇష్టం అత్తయ్యా

స్వాతి అదృష్టానికి ఆనంద పడింది సాకేత

ప్రేమించే భర్త తల్లి కూడా కాబోతోంది ఎవరికైనా అంతకంటే కావల్సిందేముంటుంది ?

"బూరె బుగ్గలతో బోసి నవ్వులు కురిపిస్తూ నక్షత్రాల్లా మెరిసిపోయే కనుపాపలతో, ఒత్తయిన నల్లని పట్టు కుచ్చువంటి జుట్టుతో క్యాలండర్-లో ని ఓ పాపాయి రూపం కళ్ళకు కట్టింది సాకేతకు

.సాకేత కళ్ళు ఆనందంతో మెరిశాయి

"అత్తయ్యా! మన స్వాతికి ఆడపిల్ల పుడితే బావుంటుంది కదూ ?"'ఛీ ఛీ శుభమా అంటూ పిల్ల నీళ్ళోసుకుందీ అని చెబితే ఆడపిల్ల పుట్టాలంటావా ? బుద్ధు లెక్కడికి పోతాయి ఓర్వలేని బుద్ధీ నువ్వూ అందుకే అంటారు బుద్ధికొద్దీ బువ్వ అని

ఈసడించుకుంటూ దులపరిం చేసింది జానకమ్మ

సాకేత ముఖం చిన్నబోయింది

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి నాకు తెలీకన్నా నత్తయ్యా అంది చిన్నబోయిన గొంతుతో

"అయినా తగుదునమ్మా అంటూ నీకు చెప్పడం నాదే బుద్ధి తక్కువ

సాధిస్తూ వెళ్ళిపోయింది జానకమ్మ

అంత కాని మాట తనేమందో సాకేతకు అప్పటికీ అర్థం కాలేదు పాపాయి అయితే ఎంచక్కా ఉంటుంది తల దువ్వి జడలు వెయ్యవచ్చు రకరకాల ఫ్రాక్‌లు తొడగవచ్చు పువ్వులు పెట్టొచ్చు - ఎంతో బావుంటుంది అదేగా తనంది

మంచిగా మాట్లాడుతూ, మాట్లాడుతూనే దులపరింపచేసే అత్త స్వభావం తెలిసిందే అయినా ప్రతిసారీ క్రొత్తగా ఉండి బాధ కలిగిస్తుంటుంది సాకేతకు

అక్కడ జరిగింది ఏమీ లేదు కానీ మనస్సు గాయపడేందుకు ఒక చిన్నమాట చాలు ఒక కంటి చూపు చాలు అలాంటివి ప్రతిక్షణం తప్పకుండా భరించవలసి వచ్చిన వాళ్ళు నిజంగా దురదృష్టవంతులు

మధ్యాహ్నం మధ్య గదిలో మీటింగ్ ప్రారంభమైంది చింతపండు బేసిన్‌తో ప్రక్కింటి పిన్నిగారూ సగం అల్లిన వైరు బుట్ట చేతోట్ట పట్టుకుని వనజా చేట నిండుగా బియ్యం పోసుకుని టీచరు భార్య కాంతమ్మా వచ్చి చేరారు

మీటింగు పెట్టుకునేందుకు ఆ ఇల్లు వాళ్ళకు అనుకూలంగా ఉంటుంది ఇంట్లో మగవాళ్ళు ఇద్దరూ ఉదయం అనగా షాపుకు వెళ్ళిపోతే తిరిగి ఏ రాత్రికో ఇంటికి చేరతారు

పగలంతా అత్తా - కోడలూ ఇద్దరే

అందుకే పనులు తీర్చుకుని ఆ యింట చేరుతుంటారు

కబుర్లాడుతూనే తమ తమ పనులు చక చకా చేసుకోడం వాళ్ళకు అలవాటు జానకమ్మ మాత్రం అలాంటి పనులేవీ చెయ్యకుండానే కబుర్లు చెబుతుంది

ఇంట్లో ఎప్పుడూ ముట ముట లాడుతూ, కోడలుమీద రుస రుసలాడే జానకమ్మ ఆ మీటింగులో మాత్రం సంతోషంగా ఉంటుంది

మళ్ళా అందరూ వెళ్ళిపోయాక జరిగిన సంభాషణలో వాళ్ళు అన్న ఒకొక్క మాటనే సాగతీస్తూ, సణుగుతూ ఉంటుంది ఆమె ముఖం సంతోషంతో వెలిగిపోతుండటం చూసిన విమలమ్మ అడిగింది, "ఏమిటమ్మోయ్ జానకమ్మ వదినా నీలో నువ్వే నవ్వుకుంటున్నావ్ మాకూ చెబితే మేమూ నవ్వుతాముగా " అంది చింతపండులోని గింజలు దబ్బళంతో ఒలిచిపోస్తూ

ఆ మాట కోసమే కాచుకున్న జానకమ్మ సంతోషంగా నవ్వింది

"ఏమీ లేదు ఒదినా అల్లుడుగారు ఉత్తరం వ్రాశారు "

"ఏవిఁటీ పండక్కు వస్తున్నారటనా ?" లేని కుతూహలం ప్రదర్శించింది వనజ

"అహఁ నేనే వెళ్ళాల్సి రావచ్చు " వాళ్ళల్లో విషయం పట్ల మరింత కుతూహలం పెంచుతూ అంది జానకమ్మ

"పండక్కు నిన్నే రమ్మని వ్రాశారేమిటీ ?"

"కాదమ్మా ఒదినా అమ్మాయి నీళ్ళోసుకుందిట వేవిళ్ళతో సతమతమైపోతూందిట బిడ్డ "

"అదా సంగతీ" నీ మొహం చూస్తేనే ఇలాంటిదే ఏదో ఒకటి ఉంటుందని అనుకున్నాను అప్పుడే "

"అయితే మనకు పార్టీ ఉందన్న మాటే " అంది కాంతమ్మ చేటలోని బియ్యం అటూ, ఇటూ కదుపుతూ

స్కూల్లో వాళ్ళాయనకు ప్రతి చిన్న విషయానికీ.. మిగతా స్టాఫ్ దగ్గర్నించి బలవంత పెట్టో, మొహమాటపెట్టో, గోళ్ళూడగొట్టో, పార్టీలు వసూలు



ఇటీవల ఖరగ్‌పూర్‌లోని జైహింద్ నగర్‌లో రవీంద్రభారతి సంస్థ వారు ఏర్పాటు గావించిన శిల్ప, చిత్రకళా ప్రదర్శన సందర్శిస్తున్న ప్రేక్షకులు



ఇటీవల విశాఖపట్నంలో శారదా ఫైన్ ఆర్ట్స్ దశమ వార్షికోత్సవ సందర్భంగా నృత్య ప్రదర్శన ఇచ్చిన కుమారి జ్యోతీ నాయుడికి సినీ నటి జయసుధ మెమెంటో నందిస్తున్న చిత్రం

# ఎదవీణ మ్రోగిన వేళ...

చేయడం హాబీ అదే అలవాటు ఆయనగారి శ్రీమతికీ వచ్చిందని ఆ వాడ-కట్టులోని అమ్మలక్కల అభిప్రాయం

"వదినా! స్వాతికి పెళ్లయి రెండేళ్ళు కావడంలా ?"

"మరే మొన్న వెళిలన శ్రావణానికి రెండేళ్ళూ నిండాయి "

"అయితే జానకమ్మగారు అమ్మమ్మ అవుతున్నారన్నమాట ఇక నానమ్మ కావడమే "

"అలస్యానికే ముంది కాంతం కనే కోడలు రడీగానే ఉంది ఇవ్వాళ కాకపోతే రేపూ అంతేగా" అందుకుంది విమలమ్మ

కోడలు ఏవన్నా విశేషం వినిపించిందా పిన్నిగారూ ? వనజ ఆరాగా అడిగింది

ఏదీ ? ఇంకా ఏవీ లేదు "

"అహఁ అలాగా ఇద్దరి పెళ్లీ ఒకేసారి అయినట్టుంటేను "

"అవును ఇద్దరి పెళ్లిళ్లూ ఒకేలగ్నానికయ్యాయి "

లోపల గదిలో మధ్యాహ్నం టిఫిన్‌కోసం పిండి కలుపుతున్న సాకేత అదిరి పడింది

పని చేస్తున్న ఆమెచేతులు ఆగిపోయాయి

కొత్తగా ఏదో విషయం అర్థమైనట్టు ఆమె గుండె వేగంగా కొట్టుకుంది

"అప్పుడే తానేదో విషయం గ్రహించినట్టు ఆశ్చర్యపోయింది

ఔను ఆ విషయం తనెప్పుడూ ఆలోచించలేదు

ముందు, ముందు ఈ ప్రశ్నకు జవాబు చెప్పుకోవలసిన బాధ్యత తన మీద ఉంది అంతలేని ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరి అయిపోయింది క్షణంలో ఆమె మెదడు

ఈసారి జాగ్రత్తగా వింది బయటినుండి వస్తున్న మాటలు

"పోనీ అత్తయ్యగారూ, ఏదైనా డాక్టరుకు చూపించలేకపోయారా?"

"నీది మరీ చోద్యం వనజా పెళ్ళయి ఎన్నేళ్ళయి పోయిందని డాక్టర్ల చుట్టూ తిరగలేదంటావు ? అయినా వనజా! నీకు పెళ్ళయి మూడేళ్ళు కావడంలా?" విమలమ్మ సన్నగా అంటించింది

వనజ మొహం మాడిపోయిందా మాటలతో

మేం జాగ్రత్త పడుతున్నాం పిన్నిగారూ " అంది వినీ వినిపించనట్టు

"వాళ్ళూ అంతేనేమోలే అయినా పిల్లా, పీచూ బాదరబందీ ఇప్పట్నించీ ఎందుకమ్మా "

"అంతేలే ఒదినా అందుకే నేనూ ఊరుకుంట

"అవును గానీ జానకమ్మొదినా, ఈ విషయం విన్నావా ? మొన్న పేపర్లో వచ్చింది "

'ఏవిఁటొ దినా ?"

"అదేదో ఊళ్ళోనట – కట్నం చాల్లేదని అత్తా – మొగుడూ కలిసి కోడలి-మీద కిరసనాయిలు పోసి నిప్పంటించారట నలుగురూ కలిసి హాస్పిటల్‌లో చేరిస్తే, ఈ మాట చెప్పి చచ్చిపోయిందటా పిల్ల ఎంత దారుణమో చూశావుటమ్మా ?

అంతేనమ్మా వదినా కోడలూ, కూతుర్లాంటిదే అనుకోవాలి అందరికీ ఆ బుద్ధి ఉంటుందా ?"

విమలమ్మకు ఒక్కతే కూతురు కాబట్టి ఆవిడకు కోడలు వచ్చే ప్రసక్తిగానీ, కోడలిమీద పెత్తనం చేసే అవకాశం గానీ, రాచి రంపాన పెట్టే వైనంగానీ లేవు అందుకే ఆమె జానకమ్మకు తగిలి రావాలని అత్తలు కోడళ్ళను రాచి రంపాన పెట్టిన కథలనే ఎక్కువగా చెబుతుంది

దానికి సమాధానంగా తను కోడల్ని పువ్వుల్లో ఉంచి చూసుకుంటు-న్నట్టుగా జవాబు చెబుతుంటుంది జానకమ్మ

ఆ తరువాత సంభాషణ అనేక విషయాలమీద నడచి పనివేళ అయ్యేప్పటికి తిరిగి మొదటి విషయానికొచ్చింది

"అయితే జానకమ్మ ఒదినా బెజవాడ ఎప్పుడు వెడుతున్నావ్ ?"

ఏదీ మి అన్నయ్యగారు వస్తే ఎప్పుడు వెళ్ళేదీ నిర్ణయం అవుతుంది నాకు మాత్రం ఇప్పటి కిప్పుడే వెళ్ళి దాన్ని చూసి రావాలని కొట్టుకు పోతోంది ప్రాణం "

కాదుటమ్మా మరీ

ఇంటి విషయాల్లో పెత్తనమంతా జానకమ్మదే అనే విషయం అందరికీ తెలుసు అయినా, ఆవిడ నలుగురి ముందూ అన్నింటికీ, మా వారు, , మా వారి నడిగి చెబుతా హమ్మో ఆయన " అంటుంటుంది ఆ విషయాన్నే విమలమ్మ ప్రతి సారీ ఎత్తి చూపిస్తుంటుంది, జానకమ్మ లేకుండా చూసి

మధ్యలో వీలు చూసుకుని, "మా కోడలు బుద్ధి చూశావా వనజా ?" అంటూ ఉదయం తనకూ, కోడలికీ జరిగిన సంభాషణకు చిలవలూ పలవలూ చేర్చి చెప్పి అలాగా అత్తయ్యగారూ అయినా ఆవిడకు అదేం కుళ్ళుబోతు బుద్ధి ?" అంటూ వనజ సానుభూతి పొందేవరకూ జానకమ్మకు శాంతి కలగలేదు

(ఇంకా ఉంది)

# శరీర సౌష్టవం వికసిస్తుంది-అన్నీ సమకూర్చుకున్నట్టు.

ఒయాసిస్ సోప్.

ఇది మీ జీవితంలో విశ్వాసాన్ని నింపుతుంది పాల తెలుపు, స్వచ్ఛమైన ఆకుపచ్చ, లైట్ పింక్ రంగుల్లో







## ఒయాసిస్

టాయ్‌లెట్ సబ్బు.

ప్రతి క్షణంలో జీవితాన్ని అనుభవిస్తున్నట్టు,
మీలో విశ్వాసాన్ని రేకెత్తిస్తుంది

ఓస్వాల్ ఆగ్రో మిల్స్ లిమిటెడ్,
న్యూ ఢిల్లీ వారి నాణ్యమైన ఉత్పాదన

ULKA-D-OAM-955 TEL

# ప్రసాదిరాయి

**సా**యంత్రం ఏడు గంటలకు జరగబోతున్న మహిళామండలి మీటింగుకు తయారవుతోంధి జ్యోతి ఆమె మహిళా మండలి సెక్రటరీ!

అద్దం ముందర నిలబడి ముడి సరిగ్గా వచ్చిందో లేదో చూసుకుంది డ్రెస్సింగ్ టేబుల్ సొరుగులోంచి చీరకు మ్యాచ్ అయే నెయిల్ పాలిష్ తీసుకుంది

జ్యోతి భర్త రాజారావు పి డబ్ల్యు డి లో అసిస్టెంట్ ఇంజనీర్‌గాపని చేస్తున్నాడు వారి ప్రధమ సంతానం సతీష్‌కు ఏడేళ్ళు కాన్వెంట్‌లో రెండవ తరగతి చదువుతున్నాడు రెండవది ప్రియ ఐదేళ్ల-వయస్సు, యు కె జి చదువుతోంది

మమ్మీ! అంటూ వచ్చాడు సతీష్ జ్యోతి దగ్గరకు

వాడి చేతిలో ఏదో పుస్తకం వుంది వెనకాలే ప్రియ వచ్చింది చేతిలో బ్రెడ్‌స్లైస్‌తో

ఇద్దరూ స్కూల్ డ్రెస్‌లోనే వున్నారు టైలు వూడిపోయి, తెల్లని చొక్కాలు మాసిపోయి రేగిన జుట్టుతో వున్న వాళ్లని చూడగానే జ్యోతికి చిర్రెత్తుకొచ్చింది

మా మిస్ డైరీలో ఏదో వ్రాసింది, చూడు మమ్మీ! అన్నాడు సతీష్

రోజా బ్రెడ్ వద్దు మమ్మీ! నాకు జంతికలు కావాలి! అంది ప్రియ

జ్యోతి వినిపించుకోలేదు గట్టిగా రాముా! అని పిలిచింది

పని కుర్రాడు రాము పరిగెత్తుకుని వచ్చాడు

ఏమిటి వీళ్ల అవతారాలు యిలా వున్నాయి? స్కూల్ నుంచి రాగానే స్నానం చేయించమని ఎన్ని-సార్లు చెప్పాను నీకు? ఇప్పుడు మా ఫ్రెండ్స్ వస్తే యిలాగేనా వీళ్ళు వుండేది వెళ్ళు వెళ్ళి స్నానం చేయించు

తల్లి కేకలకు బయపడి సతీష్ ప్రియ రాము వెంబడి వెళ్ళిపోయారు

మరో ఇరవై నిముషాలలోనే వారికి స్నానం చేయించి తీసుకొచ్చాడు రాము వాళ్లకు తలదువ్వి, పౌడరువేసి, బీరువాలో నుండి హాండ్ బ్యాగ్ తీసు-కుంటున్న జోతి నుద్దేశించి అన్నాడు రాము

గుడ్డలు యివ్వండమ్మా!

బీరువాలో నుండి గుడ్డలు తీసి మంచం మీద వేసింది జ్యోతి

ఇంతలో బయట ఏదో కారాగిన చప్పుడైంది

రివ్వున పరుగెత్తింది జ్యోతి

రివ్వున పరుగెత్తింది జ్యోతి

తల్లి వచ్చిన వారిని ఆహ్వానించడమూ, అందరితో గలగలా నవ్వుకోవడమూ వినపడుతూనే వున్నాయి సతీష్‌కి

తల్లి ఎక్కడ వెళ్ళిపోతుందోనన్న భయం వుంది వాడికి అందుకే షర్టు గుండీలు సరిగ్గా వేసుకో-కుండానే పరుగెత్తుకొచ్చాడు హాల్లోకి

అంతా సోఫాలు ఆక్రమించుకొని యున్నారు వారి మధ్యన కూర్చొని యున్న జ్యోతి దగ్గరకు వెళ్లాడు సతీష్

మమ్మీ! ఫోర్ లైన్స్ బుక్స్ తెలుగు యింగ్లీష్ కొనమంది మా మిస్! ప్లీజ్! కొనివ్వు మమ్మీ! తల్లి చేయి వూపుతూ జాలిగా అడిగాడు సతీష్

అంత వరకూ నవ్వుతున్న జ్యోతి ముఖం అప్ర-సన్నంగా మారింది పక్కనున్న ఆవిడతో అంది యిలా-

"అబ్బబ్బ! ఈ కాన్వెంట్ చదువులు లేకుంటే పీడాపాయేగానీ నా ప్రాణం తీసేస్తున్నాడు వెధవ! రోజుకో రకం పుస్తకం! రోజుకోరకం పెన్సిలూ! ఇంతింతడబ్బుకట్టి చేర్పిస్తున్నామా, ఉదయం

చంద్రావళి సుదర్శన్



నుంచి సాయంత్రం వరకూ అక్కడే అఘోరిస్తారా! మళ్లీ రాగానే మొదలు. అంతగా పొద్దస్తమానమూ ఏం చదువుంటుందో? వూరికే పిల్లల ప్రాణాలు తోడేస్తుంటారు"

"నిజమే మరి! అసలు ఈ కాన్వెంట్ స్కూల్స్ అన్నీ ఓ వ్యాపారం అయిపోయాయనుకో! అంది పక్కనున్న ఆవిడ

మరొక నారీమణి అందుకొంది

ఆ మాట కొస్తే జ్యోతీ! మనమంతా కాన్వెంట్ స్కూల్స్‌లో చదివామా? మనకు చదువు రాలేదా! డిగ్రీలు తీసుకోలేదా!" అతిశయంగా వుంది ఆమె కరం

అంతా కలిసి సతీష్‌ని మరిచి పోవటంతో వాడు మళ్లీ మమ్మీ! అన్నాడు

విసుగ్గా చూసింది జ్యోతి

సరేలేరా! ఉదయమే కొని యివ్వమని రామూతో చెబుతాలే!

ఉదయం కొనిస్తే నేనెప్పుడు రాసుకునేది? నాకు టైం వుండదు రాయకపోతే మా మిస్ కొడుతుంది!"

ఏం కొట్టదులే బాబూ! మీ హెడ్ మిస్సెస్ మా మహిళా మండలి కొస్తుంది కదూ! అప్పుడు చెబుతాంలే! వెళ్లి ఆడుకో!

ఒక లావు పాటావిడ సతీష్ బుగ్గ సాగదీస్తూ అంది

సతీష్ నిరాశతో తలవాల్చుకుని వెళ్లిపోయాడు



రామూ! వంట మనిషి వెళ్లి పోయాక జాగ్రత్తగా తలుపులు వేసుకో అయ్యగారు యివాళ రారుగానీ పిల్లలకిఅన్నం పెట్టేసి నువ్వు తినేయ్!

గబగబా చెప్పేసి వెళ్లి పోయింది జ్యోతి

తల్లి వెళ్లి పోయిన తరువాత కాసేపు టి వి చూశాడు సతీష్ సరిగ్గా రాలేదు టి వి తర్వాత రాము అన్నం తినిపించాడు ఏం తిన్నారో ఏమో యిద్దరూ అలాగే సోఫాలో నిద్రపోయారు

పిల్లల్ని యిద్దర్నీ తీసి మంచం మీద పడుకోబెట్టాడు రాము

* * *

ఉదయం పిల్లలు స్కూలుకు వెళ్లే సమయానికి జ్యోతి లేవనేలేదు పుస్తకాలు కొనలేదని నసుగుతూనే వున్నాడు సతీష్ డబ్బులేదు రామూ దగ్గర జోతిని లేపేందుకు ధైర్యం చాలలేదు సాయంత్రం తప్పకుండా కొనిపెడతానని నచ్చచెప్పి రిక్షా ఎక్కించేశాడు రాము పిల్లల నిద్దరినీ

తిరిగి సాయంత్రం సతీష్ యింటికి వచ్చేసరికి, తల్లీ మహిళా మణులంతా హాల్లోనే సమావేశమ్మై కనపడ్డారు తల్లిని చూడగానే దుఃఖం ముంచుకు వచ్చింది సతీశ్‌కు

మమ్మీ! మా మిస్ స్కేల్‌తో కొట్టింది నన్ను!" ఏడుస్తూ చెప్పాడు

కొట్టిందా! ఎందుకు? అపనమ్మకంగా అడిగింది జ్యోతి

గట్టిగా కొట్టింది!' మళ్లీ చెప్పాడు సతీష్

పుస్తకం కొనుకొలేదని కొట్టింది!"

కొనుక్కోనంత మాత్రాన కొట్టడమేనా! ఇంట్లో నేను కూడా ఒక దెబ్బ వేయను ఇంతింత కట్టి కాన్వెంట్స్‌లో చేర్పించే దెందుకు! ఇలా కొట్టి పంపించేందుకా? ఇంత మాత్రం దానికి ఏదో తెలుగు స్కూళ్లో పారేస్తే పోయేదిగా!'

కోపంతో ముక్కు ఎర్రబడ్డది జ్యోతి

బాధ పడకు జ్యోతీ! ఇవాళ వాళ్ల హెడ్‌మిస్ట్రెస్ రంగలక్ష్మి వస్తుంది కదా! మన మహిళామండలికి చెబుదాంలే!

తన అసలు సమస్య పట్టించుకోనందుకు మనసులో విసుక్కుంటూ లోపలకు వెళ్లాడు సతీష్

తమ తల్లిని ఎప్పుడూ తమతో కలవనీయని ఈ ఆడవాళ్ల గుంపు అంటే కోపం సతీష్‌కి

మరి కాస్సేపట్లో నారీమణులంతా వెళ్లి పోయారు

* * *

ఆ మరుసటి రోజుమాత్రం పుస్తకాలు కొనుక్కొనే వెళ్లాడు సతీష్

ఇంటి దగ్గర జ్యోతిలేదు స్నేహితురాలి పెళ్లికి వెళ్లింది మరురోజు సాయంత్రానికిగానీ రాదు రాజారావు క్యాంప్ నుండి వచ్చాడు

ఇటీవలే స్థలం కొనుకొన్నాడు రాజారావు దానికి పునాదులు తీయాలని కాంట్రాక్టరుతో మాట్లాడుతున్నాడు

"పునాదులు, కట్టడాల విషయం తమకు తెలియందేముంది సార్! ఇరవై ఐదు వేలవుతుంది!"

అంటున్నాడు కంట్రాక్టరు

అదే నేనూ అంటున్నాను నేను ఐదు వేలకు కూడా పునాదులు వేయించిన రోజులున్నాయి ఇంకా యిల్లంతా కట్టాలి పునాదికే పాతిక వేలవుతే ఎలా? ఓ పదిహేను వేలల్లో అయ్యేటట్లు చూడు!

సరేసార్! మీ యిష్టం! కాని యింటి కంటే ముందు పునాదే ముఖ్యం! పునాది గట్టిగా పడితేనే యిల్లు గట్టిగా నిలిచేది

నాకు తెలుసులేవోయ్!

అప్పుడే వేలాడేసుకున్న ముఖంతో యింటికి వచ్చాడు సతీష్ వెనకాలే బ్రయు! ఎంత మాత్రం హుషారు లేదు ముఖంలో సప్త సామ్రాజ్యాలూ కోల్పోయినంత దీనంగా వున్నాడు

అదేమిట్రా అలా వున్నావేం?

యాదాలాపంగా అడిగాడు రాజారావు

తండ్రి అడగడమే తరువాయి తండ్రిని చుట్టుకుని బావురుమన్నాడు సతీష్

కంగారు పడ్డాడు రాజారావు

ఏమయింది బాబూ! అంటూ ఎత్తుకున్నాడు

మా మిస్ నాతో మాట్లాడడంలేదు డాడీ!

వెక్కుతూ చెప్పాడు సతీష్

ఓస్, అంతే కదా! రేపు మాట్లాడుతుందిలే!

'తేలిగ్గా చెప్పాడు రాజారావు

కాదు డాడీ! అసలు నా హోం వర్కు చూడలేదు నన్ను పోయమ్ చదవమనలేదు నాకు హోం వర్కు కూడా యివ్వలేదు డాడీ! నువ్వు నా దగ్గరకు రావద్దు అనేసింది

ఏం చేశావు నువ్వు? ఎవరినైనా కొట్టావా?

'లేదు డాడీ!

మరి, ఏదన్నా టిస్టు ఎగ్గొట్టావా?

'లేదు డాడీ! ఇవాళ టిస్టు కూడా రాశాను నాకు మార్కులు యివ్వలేదు ఇచ్చి వుంటే పస్టుమార్కు నాకే వచ్చి వుండేది ఆ రవికి రాక పోయేది

"సరే, రేపు వచ్చి మీ మిస్ నడుగుతాలే!

రాజారావు వస్తానని ప్రామిస్ చేసే వరకూ వదిలి పెట్టలేదు సతీష్ ఆవేళంతా పిల్లల్ని చూసుకున్నాడు రాజారావు

* * *

ఉదయాన్నే పిల్లల్ని జీపులో కూర్చుండ బెట్టుకుని స్కూల్‌కు తీసుకెళ్లాడు రాజారావు అప్పటికింకా హెడ్ మిస్ట్రెస్ రాలేదు సతీష్ వాళ్ల క్లాసులోకి వెళ్లాడు రాజారావు

పిల్లల్ని సైలెన్సుగా ఉండమని హెచ్చరిస్తోంది వాళ్ల మిస్ శాంతి

రాజారావుని చూసి తొట్రుపడి నమస్కారం చేసింది సతీష్ 'మిస్'కి గుడ్‌మార్నింగ్ చెప్పి వెళ్లి తన ప్లేస్‌లో కూర్చున్నాడు

వచ్చేడే కాని ఎలా మొదలు పెట్టాలో తోచలేదు రాజారావుకి

"మావాడిని నిన్న మీరసలు పలకరించలేదుట, వాడు చాలా ఫీలయ్యాడు" అన్నాడు చివరికి

గొప్పవాళ్ల పిల్లల్ని పలకరించటం ఎందుకండీ! ఎటొచ్చి ఏదైనా తప్పుగా మాట్లాడితే మా ఉద్యోగాలు వూడతాయి అందుకనే మీ అబ్బాయిని పట్టించుకోలేదు

ఆ అమ్మాయి గొంతులో వినబడుతున్న వ్యంగ్యానికి రాజారావు తెల్లబోయాడు

ఏమిటి మీరనేది?

"ఉన్నమాటే! మీ అబ్బాయికి ఫోర్‌లైన్స్ నోట్ బుక్ తెచ్చుకోమని వారం రోజులుగా చెప్పాను కానీ తెచ్చుకోలేదు అందుకని మొన్న ఓ దెబ్బ వేశాను ఇక్కడ మీ పిల్లలు చదువుకోడానికి వచ్చినప్పుడు, ఇక్కడ మేము తిట్టినా కొట్టినా పడాల్సిందే! అంత మాత్రం దానికి మీ మిసెస్ హెడ్ మిస్ట్రెస్‌తో కంప్లయింట్ యిస్తారా? ఇక్కడ మేము వుండేది ఎందుకు?

## కుటుంబ కలహాలకు కారణం?

కుటుంబ కలహాలు ప్రపంచంలోని అన్ని సమాజాలలోనూ సహజం. జపాన్ ఇందుకు మినహాయింపేమీకాదు పాఠశాలల్లో చదువుకొంటున్న పిల్లలు ఇద్దరు ముగ్గురు ఉండి, 30 – 45 ఏళ్లలోపు గల 300 మంది జపాన్ గృహిణులల్లో ఇటీవల అభిప్రాయ సేకరణను నిర్వహించారు గతానికీ, ఇప్పటికీ కుటుంబ కలహాలలో ఏమైనా వ్యత్యాసం ఉన్నదా? అని అడిగినప్పుడు 45 శాతం మంది గృహిణులు ఉన్నదని సమాధానమిచ్చారు కుటుంబంలో పిల్లలు మొదలుకొని పెద్దల వరకూ అంతా తమ తమ ప్రయోజనాలను సమర్థించుకొంటారని 37 శాతం మంది పేర్కొన్నారు

జపాన్‌లో 99 శాతం కుటుంబాలలో కలహాలు సంభవిస్తుంటాయని సర్వేలో వెల్లడైంది పిల్లల్లో కలహాలు చాలా ఎక్కువగా (92 7 శాతం) సంభవిస్తుంటాయి తల్లిదండ్రులలో 88 3 శాతం, తల్లికీ, పిల్లలకు 80 3 శాతం, తండ్రికీ, పిల్లలకూ 44.3 శాతం ఉంటున్నాయి పిల్లల పోట్లాటలను తాము పట్టించుకోమని యిటువంటి కలహాలు వారి మానసిక అభివృద్ధికి అవసరమనీ 70 శాతం మంది తల్లులు అభిప్రాయపడ్డారు తల్లిదండ్రుల మధ్య తరచుగా కలహాలు రావడానికి కారణం పిల్లలు (37.7 శాతం) భార్యా లేక భర్త స్వభావం (30 శాతం) ఇంటి వ్యవహారాల నిర్వహణ (10 శాతం) తనకు కావలసినది జరిగి తీరాలని కుటుంబంలో ప్రతి ఒక్కరూ పట్టుబడతారని సర్వేలో వెల్లడైంది ఆ ఏకపక్ష వైఖరే కలహానికి దారితీస్తుంది అసలు కలహాలే ఉండకూడదు అన్న ఆలోచనను 70 శాతం మంది వ్యతిరేకించారు. (జ. వా)

## పునాదిరాయి

చదువు చెప్పడానికిగానీ పిల్లల్ని వూరికే కూర్చోబెట్టడానికి కాదే! ఇక్కడికి అందరూ గొప్పవాళ్ల పిల్లలే వస్తారు అందర్నీ ముట్టుకుంటే కందిపోతారన్నట్లు చూసుకోడానికి మేమేం మీరు పెట్టిన ఆయాలము కాదు మేము యిక్కడ చదువు చెప్పడానికి జీతం తీసుకుంటున్నాం కానీ పిల్లల బాగోగులు చూడడానికి కాదు అది కేవలం మీ బాధ్యత!

శాంతి ఉపన్యాసం యిస్తుండగానే ప్రియను వెంట బెట్టుకుని ప్రియా వాళ్ల మిస్ ప్రమీల వచ్చింది

మీరేనా ప్రియ నాన్నగారు? అంటూ అడిగింది ప్రమీల

తల వూపాడు రాజారావు

నిన్న హెడ్ మిస్ట్రెస్ నన్నుకూడా మందలించింది మీ పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోమని అప్పటి నుండీ నేనే మిమ్మల్ని కలుద్దామని అనుకొంటున్నాను పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోవలసింది మేము కాదండీ మీరు! మీ ప్రియ కొద్దిగా కారం తగిలితే అన్నం తినదు మీకు తెలుసా! ప్రతిరోజూ "అన్నం తినదు తర్వాత ఆకలి అని ఏడుస్తోంటే నేను ఎన్నోసార్లు బిస్కట్స్ తీసి యిచ్చాను పోనీ డబ్బు తెచ్చుకో సతీష్' అంటే బయట అమ్మే వస్తువులు కొని తింటే మా మమ్మీ తిడుతుంది అంటారు ఇక్కడేం ఈగలు ముసిరేవేవీ లేవే! స్కూల్ యాజమాన్యంతోనే ఆ షాప్ నడుస్తోంది అందులో బిస్కట్స్ వుంటాయి అంతే కదా! అవి తిన్నంతలో ఆరోగ్యమేమైపోతుంది? అంతా కొనుక్కుని తింటూ వుంటే మీ పిల్లలు చూస్తూ వుంటారు ప్రియకెప్పుడూ జలుబే! ఒక్కనాడైనా కర్చీఫ్ యిచ్చి పంపించారా యింట్లో! మేము పిల్లల ముఖం చూసి సర్దుకు పోతాం గానీ, లేకపోతే మీ పిల్లలకి చేయవలసిన ఖర్మ మాకేం పట్టింది?

రాజారావు ముఖం వాలి పోయింది

ఈసారి శాంతి అందుకుంది

మేం చెప్పే మాటలు మీకు కఠినంగానే వుండవచ్చు మీరు హెడ్‌మిస్ట్రెస్ దగ్గర మామీద కంప్లయింట్ యివ్వవచ్చు మా వుద్యోగాలు పోవచ్చు అంతే కదా! టెంపరరీ వాళ్లం! ఈ కాన్వెంట్ కాకపోతే మరోటి! కానీ దెబ్బ తినేది మీ పిల్లల భవిష్యత్తే కదా! ఇప్పుడీ చదువు బోడి ఎల్‌కెజీనే అనగలరు మీరు, కానీ భవిష్యత్తులో గట్టిగా నిలబడాలంటే మంచి పునాదిరాయి అవసరం మేం చెప్పే చదువు కూడా పునాది వంటిదే! ఇది పైకి కనబడదు అంతే తేడా!

హెడ్ మిస్ట్రెస్ రంగలక్ష్మి రాజారావు వచ్చాడని విని పరిగెత్తుకొచ్చింది

శాంతి, ప్రమీలా మౌనంగా అయిపోయారు

ఏమిటలా వచ్చారు? కంగారుగా అడిగింది

అబ్బే ఏంలేదు! మా పిల్లలెలా చదువుతున్నారోకనుక్కుందామని వచ్చాను అన్నాడు రాజారావు

వాళ్లకేం, మంచి తెలివైన వాళ్ళు! అంది రంగలక్ష్మి

అయితే మాత్రం చక్కని పునాది అవసరం కదా! వస్తానండీ, చాలా థాంక్స్!

ప్రమీలకూ, శాంతికీ చెప్పేసి వచ్చి జీపు ఎక్కాడు రాజారావు దూరంగా నిలబడ్డపిల్లల టా టా చెప్పారు

కాంట్రాక్టరుతో గట్టిగా చెప్పాలి! ఎంత ఖర్చయినా సరే! పునాది మాత్రం స్ట్రాంగ్‌గా, చెక్కు చెదరకుండా వేయమని చెప్పాలి!

జీపు స్టార్టు చేస్తూ అనుకున్నాడు రాజారావు □



# దివ్యమైన కేదారనాథ్

కేదారనాథుని దివ్య మందిరము

హిమాలయ రమణీయ ప్రకృతి శోభలో 3581 మి ఎత్తు శిఖరాలమీద ఒకవైపు రజత శిఖరాలు మరో-వైపు వివిధ పుష్పభరిత మందాకినీ లోయ ఆహ్లాదాన్ని కలిగిస్తుండగా కేదారనాథుని దివ్యదర్శన-మౌతుంది మహా భారత భీషణ సంగ్రామములో కలగిన పాప ప్రక్షాళనార్థము పాండవులు యిక్కడ శివుని సేవించినట్లుగ స్థల పురాణం చెపుతుంది పాండవుల శ్రేయస్సుకోరి పరమ శివుడు కాశీనుండి యిక్కడకు విచ్చేశాడని కూడ భావన కలదు ఈ దుర్గమ ప్రాతంలో కొన్ని వేల సంవత్సరాలనాడు కూడ అపూర్వ వాస్తుకళ, శిల్పకళ చోటు చేస్తు-కున్నాయి అయితే ఆలయ నిర్మాణాన్ని గురించి సరియైన ఆధారం ఈనాటికి లేదు

భక్తులు మొదట మంటపంలోగల నందిని దర్శించుకొని గర్భ గృహంలోని పరమ శివుని సేవించుకుంటారు భారత దేశంలోని ద్వాదశజ్యోతి-ర్లింగాలలో కేదారేశుడు ఒకడు ప్రధాన దేవాలయం చుట్టూ వివిధ దేవుల విగ్రహాలు, మందిరాలు ఉన్నాయి

ప్రతిరోజు ఉదయం శుభ ప్రభాతం బాలభోగము మహాభిషేకము, రుద్రాభిషేకం, అష్టోత్తరము, శివపూజ జరుగుతాయి ఈ పూజను నిర్వాణ దర్శనమంటారు సాయంకాలము శివష్టోత్తరము శివ సహస్రనామము, శివనామావళి, శివమహిమ స్తోత్రము, ఏకాంతసేవ జరుగుతయి ఈ పూజను శింగార దర్శనమంటారు

సాధారణంగ నవంబరు, ఏప్రిలు మాసాల మధ్య ఇక్కడ అతి శీతలంతో పాటు మంచు అధికంగ కురు-స్తుంటుంది కనుక ఆ కాలంలో మందిరము మూసివేస్తారు ఏప్రిలు మాసము చివర తెరిచిన గుడి దీపావళి మరు రోజు మూస్తారు ఇక్కడి పూజారులు 'పండాలు' వీరు సంస్కృతములో ఉద్దండ పండితులయి ఉంటారు గుప్త కాశి, ఉక్తి మఠము చుట్టుగల ప్రాంతములో కూడ వీరు నివ-సిస్తుంటారు

రుద్ర ప్రయోగ నుంచి కేదారనాథ్ వెళ్ళటానికి కొండను తొలచి వేసిన మార్గము



మందాకనీ నది ఒడ్డున కేదార్‌నాథ్ మార్గము



## దర్శనీయ తీర్థాలు

కేదారనాథ్ చుట్టూరా హంసకుండ్, ఉదకకుండ్, రేతకుండ్ మున్నగు జలధారలున్నాయి ఉత్తర దిశలో 3/4 కి మీ దూరంలో గంధి సరోవరము, నైరుతి దిశలో 5 కి మీ వెళితే వాసుకి సరోవరము నయనానందకరంగ మను చరిత్రలోని నళినీ బాంధవ భానుతప్త రవికాంతస్యం దినీహార కందళ చూత్కార పరంపరల్ పయి పయిన్ మద్యాహ్న-మున్ తెల్పెడిన్' వర్ణన కళ్లకు కట్టినట్లు ఉంటుంది దక్షిణంగ 1/2 కి మీ దూరంలోని ఒక-పర్వత శిఖరం షిద భైరవనాధ్ మందిరము ఉంది ఇవి కాక భీమగుహ, మధు గంగ, క్షీరగంగ, ఆది గురువులు శంకరాచార్యులవారి సమాధి తప్పక దర్శించ తగినవి

వాసుకి సరోవరంనుండి వాయువ్య దిశలో దాదాపు 3 కి మీ వెళితే స్వర్గారోహణ పర్వతాల దర్శనం అవుతుంది వెంటనే వ్యాస మహర్షులవారి మహా భారత సంహితలోని –

స్వర్గమారోహయేత్ ధర్మః
వంశ్యాన్ సంతారయేత్ పునః!
లోకానుద్ధారయే ద్వాపి
ధర్మరాజో దివంగతః"

శ్లోకం మదిలో మెదులుతుంది

## పంచ కేదారాలు.

శివుని మొండెము, చేతులు, ముఖము, నాభి, కేశములు వరుసగా కేదారనాధ్, తుంగనాధ్, రుద్ర-నాథ్, మద మహేశ్వర్, కల్పేశ్వర్‌లయందు లయమై ఉన్నవని ఆస్తికుల భావన వీనినే 'పంచకేదారాలు' అంటారు

## మార్గంలో వచ్చే తీర్థాలు

హరిద్వార్, ఋషికేశలనుండి అనేకమైన బస్సులు, చిన్నకార్లు నిత్యం కేదారనాధ్ వెళుతుంటాయి రుద్రప్రయాగవరకు బదరీ మార్గంలోనే వెళ్లి' ఆ తర్వాత కేదారనాధ్‌కు నిర్మల మందాకినీ నది ఒడ్డున ఇరుకు మార్గంలో వెళ్లాలి రుద్ర ప్రయాగవద్ద మందాకినీ, ఆలకనందల నదుల మధ్య పర్వతాన్ని తొలిచి మార్గం నిర్మించారు గౌరీకుండ్ వరకు బస్సులు వెళతాయి ఆ తర్వాత నడక ఆయాసంతో కూడి ఉంటుంది టోలీ, లేక గుర్రాలమీద వెళ్ల-వచ్చును హరి ద్వార్‌నుండి 248 కి మీ ఉంటుంది.

మార్గంలో అగస్త్యముని ఆశ్రమము, గుప్త కాశీ, సోన ప్రయాగలో సోనగంగ మందాకినీ నదుల అందాల సంగమం, గౌరీకుండ్‌లో పార్వతి, కృష్ణ భగ-వానుల దేవాలయాలు, వేడి నీటి కుండ్‌లు దర్శింప తగినవి

సోన ప్రయాగకు పడమరగ మూడు కిలోమీటర్లు కాలినడకన వెళితే "త్రియుగీ నారాయణు"ని దివ్య-మందిరము భవ్య వాస్తుకళతో హృదయ రంజకంగ ఆకట్టుకుంటుంది. మందిరమునకు ఎదురుగుండ 'అఖండ యజ్ఞకుండము' ఉంది శివ పార్వతుల వివాహ సందర్భమున అది వెలిగింపబడినదని ఆస్తికుల నమ్మకం భక్తులు యజ్ఞ భస్మాన్ని నుదుట ధరిస్తారు ఇక్కడనుండి హిమాలయ ధవళశోభ శోభాయమానంగ ఉంటుంది

## వసతులు

మే, జూన్, సెప్టెంబరు, అక్టోబరు మాసాలు కేదారనాధ్ యాత్రకు అనుకూల వాతావరణము హిమలోక్ హోటల్, యాత్రీ విశ్రాంతి గృహము, మందిర్ సమితి అతిథి గృహము, బిర్లా అతిథి గృహము, ఇంకా ప్రభుత్వ వసతి గృహాలు, ధర్మ-శాలలు ఉన్నాయి అడు గడుగున ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ టూరిస్ట్ సంస్థవారు సహాయ సహకారాలు అందిస్తుంటారు

'కేదారనాథ్' దర్శించుకున్న సహృదయులకు శివకేశవ సమన్వయం దర్శన మౌతుంది

–కెప్టెన్ షేక్ మౌలాలీ □

సీరియల్

# రేకమ్మకథ

## అన్నపూర్ణ

(గత సంచిక తరువాయి)

## 38

రామదాసుగారు పుష్కలంగా ఆస్తి పాస్తు-లున్న వ్యక్తి. ఒక విధంగా చెప్పాలంటే కొండపాడు గ్రామానికి ఆయన మకుటంలేని మహారాజు అలా అని ఎవరిమీద రాజకీయాలు ప్రదర్శించడు మనసున్న మనిషిగా ధర్మదాతగా పేరు పొందాడు ఆ గౌరవంతోనే ఆ గ్రామంలో ఎవరూ రామదాసుగారి మాటకు ఎదురు చెప్పరు ఆయన కూడా ఎదుటి వాళ్ళను ఇబ్బంది పరిచే ఏ కార్యాన్ని తలపెట్టరు

అటువంటి సద్వ్యక్తిని నిజంగా చిన్న చూపే చూశాడు భగవంతుడు ఆయనకు ఒక్కడే కొడుకు శ్రీకాంత్ అతడు కోరుకున్నట్లే ఇంజనీరింగ్ చదివించారు రామదాసుగారు చదువు పూర్తైన తర్వాత ఉద్యోగం చేస్తానన్నాడు శ్రీకాంత్ ఇంతటి ఆస్తి పాస్తులను పెట్టుకొని ఉద్యోగం చేయ-వలసిన అవసరం నీకేమిటన్నారు రామదాసుగారు ఈ పల్లెటూళ్ళో నేను పడి ఉండలేను జీవితంలో కొంత అనుభవం సంపాదించుకోవటానికైనా నేను కొంతకాలం ఉద్యోగం చేయక తప్పదు నాన్నగారూ అని పట్టు బట్టాడు శ్రీకాంత్ కొడుకును నిరుత్సాహ పరచటం ఇష్టంలేక సరే అన్నారు రామదాసు ఉద్యోగం చేసేచోట ఎవరో అమ్మాయిని ప్రేమించి ఆమెనే పెళ్ళి చేసుకుంటానని పట్టుబట్టాడు శ్రీకాంత్ వివాహ విషయంలోనూ అతడి అభీష్టమే నెరవేర్చార రామదాసుగారు రోజులు హాయిగానే వెళ్ళి పోతున్నాయ్ ఇద్దరు పిల్లలు కలిగారు శ్రీకాంత్‌కు ఈలోగా కంపెనీ వాళ్ళు ఏదో ట్రెయినింగ్‌కు అమెరికా పంపాలని నిశ్చయించుకున్నార శ్రీకాంత్‌ను మీతో పాటు నేనూ వస్తానని పట్టు బట్టింది అతడి భార్య లత ప్రియమైన భార్య మాట తీసివేయలేక ఇద్దరికీ పాస్‌పోర్టుల కోసం ప్రయత్నించాడు తాము అమెరికాలో ఉండేది మూడు మాసాలే కనుక పిల్లల్ని తాత, బామ్మల దగ్గర ఉంచిపోదామని అనుకున్నారు ఆ ప్రకారమే కొండపాడు వచ్చి తమ నిర్ణయం ప్రకటించి పిల్లల్ని అక్కడ దిగ విడిచి వెళ్ళిపోయారు శ్రీకాంత్ అతడి భార్య లత ఆ వెళ్ళటం తిరిగి వాళ్ళు రానే లేదు ఇంటికి విమాన ప్రమాదంలో ఇద్దరు మరణించినట్లు తెలిసింది అదొకపెద్ద షాక్ గుండె నిబ్బరం గల వ్యక్తి గనుక రామదాసుగారు తొందర-గానే తేరుకున్నారు ఆ షాక్ నుంచీ కానీ, ఆయన భార్య యశోదమ్మ మాత్రం దిగులుపడి మంచం పట్టింది దాంతో ఇద్దరు పిల్లల ఆలనా పాలనా చూసుకోవటం కష్టమైంది రామదాసుగార్కి వంట చేయటానికి ఒక విధవరాలు ఉంది ఇంటి పనులు చేయటానికి నౌకర్లు ఉన్నారు వాళ్ళల్లో చదువుకున్న

**జరిగిన కథ 14 : వీరేన్ అమృతను తను పెళ్ళి చేసుకుంటానని అడిగితే ఆమె నిరాకరించింది. అమృత ఆనంద్ దగ్గరకు హైదరాబాద్ వెళ్ళిపోయింది. అక్కడి నుండి తల్లి, తండ్రులు లేని ఇద్దరి పిల్లలకు ఆయాగా ఒక కుగ్రామంలో ఉద్యోగం చేయడానికి బయలుదేరుతుంది.**

వాళ్ళు లేరు ఆధునిక పద్ధతుల్లో పిల్లల్ని నడిపించటం వాళ్ళకు చేత కాదు అదీ కాకుండా కొండపాడులో స్కూలు లాంటిది ఏదీ లేదు అందువల్ల పిల్లల చదువూ సమస్యే

అన్నీ ఆలోచించే రామదాసుగారు పత్రికా ప్రకటన ఇచ్చారు లోగడ ఒకసారి ఇచ్చిన పత్రికా ప్రకటనకు జవాబేలేదు ఎవరినుంచీ కొండపాడు మారుమూల గ్రామం కావటం మూలాన ఎవరూ వచ్చి ఉండరు అనుకున్నాడు ఐనా పిల్లల బవిష్యత్తును గురించిన తపనతో తిరిగి అలాగే పత్రికో ప్రకటన చేయటం, అది ఇప్పుడు అమృత కంట పడటం జరిగింది

అమృత హైదరాబాద్ నుంచీ బయలుదేరి రెండు బస్‌లు మారి చాలా ఇబ్బందిపడి కొండపాడు చేరగలిగింది దారిలో ఆమెను సినీ నటిగా కొందరు గుర్తు పట్టి మీరు 'చంద్రవంకగారు కదూ' అని గుచ్చి గుచ్చి ప్రశ్నించారు కాదు నా పేరు అమృత అని అబద్ధం చెప్పి ఎలాగోలా వాళ్ళనుంచీ తప్పించుకు రాగలిగింది

కొండపాడు వచ్చి రామదాసుగారి ఇల్లు తేలిగ్గానే తెలుసుకో గలిగింది అమృతను చూసి రామదాసు గారు సంతృప్తి పీలవుతూ

"నేను ఇలాగే లోగడ కూడా ప్రకటన ఇచ్చాను పత్రికల్లో కానీ, అప్పుడు ఒక్కరూ రాలేదు ఈసారి నా ప్రకటనకు వచ్చింది నువ్వు ఒక్కదానివే కాబట్టి నీకు ఈ ఉద్యోగం ఇస్తున్నాను నమ్మకంగా ఉంటే నువ్వు కోరుకున్నంత జీతం ఇస్తాను మా పిల్లల భవిష్యత్తు నాకు ముఖ్యం అంటూ తన ఇద్దరు మనవలు – ఆరేళ్ళ నవీన్ నాలుగేళ్ళ ప్రవీన్‌లను పరిచయంచేసి, ఆ రోజే వాళ్ళ బాధ్యతలను ఆమెకు అప్పగించారు

అలాగేనండీ – అంది ఆ ఇద్దరు పిల్లల్ని దగ్గిరికి తీసుకొన్న అమృత

* * *

మూడు రోజులు గడిచినయ్

పల్లెటూరు, ప్రశాంతమైన వాతావరణం, ఎంతో ఆదరంగా చూస్తున్న రామదాసు దంపతులు, 'ఆంటీ ఆంటీ' అంటూ వదిలి పెట్టకుండా కొంగు పట్టుకు తిరుగుతున్న పిల్లలు – అమృత మనసుకు ఒక చెంప హాయి అనిపిస్తున్నా మరో చెంప ఏమిటో అసంతృప్తి! కారణం ఆనాడు హైదరాబాద్ నుంచీ బయలు దేరింది మొదలు ఈవేళ్టి వరకూ ఏకాగ్రతగా కూర్చొని తన ఆరాధ్య దైవాన్ని స్మరించుకోలేక పోవటమే

'ఊరందరిదీ ఒక దారి ఉలిపి కట్టేది ఒక దారి' అన్నట్లు లోకంలో దైవంమీద చాలా మందికి నమ్మకం పోతుంటే తను ఆ దైవాన్నే మొండిగా ఆరాధిస్తోంది దైవాన్ని పూజించందే ఆ దైవం ముందు కొన్ని గంటలైనా ఏకాగ్రతతో కూర్చొనందే – ఏమిటో అసంతృప్తి అనిపిస్తోందేం? తను ఏదైనా మానసిక వ్యాధికి లోనైందా? దేవుడి ముందు కూర్చొని తనని తాను మైమరిచి పోతోంది? అప్పుడు తన మనసు ఎక్కడికి వెళ్తోంది? – అది తనకే తెలియటంలేదు మొదట్నుంచీ తను అందరు ఆడ పిల్లల్లా హాయిగా బ్రతకలేక పోతోందేం? ఏమిటో అసంతృప్తి, మరి దేన్ని గురించో అన్వేషణ? – తన మనసుకు శాంతి లభించే దెప్పుడు? తన అన్వేషణకు పరమార్థం లబించే దెప్పుడు? – ఇలాంటి తర్క వితర్కాలు ఈమధ్య అమృతలో అప్పుడప్పుడు చెలరేగుతూనే ఉన్నయ్ మరి ఆమె కూడా ప్రపంచాన్ని చూస్తోంది రక రకాల మనస్తత్వాలను అర్థం చేసుకొంటోంది అనుభవాలకు కొదువే లేదాయె

ఎన్ని ఆలోచించినా ఆమె మనసు దైవం మీదికే మళ్ళుతోంది ఇక నిగ్రహించుకోలేననుకొని పిల్లలిద్దర్ని తీసుకొని అక్కడికి దగ్గిరిలోనే ఉన్న వెంకటేశ్వరస్వామి ఆలయానికి వెళ్ళింది ఆ సాయంత్రం దేవాలయానికి దారి పిల్లలే చూపించారు అమృత అడిగిన మీదట

పిల్ల లిద్దర్ని ఆలయ మంటపంలో కూర్చోబెట్టి తను గుడి చుట్టు ప్రదక్షిణలు చేసి వచ్చింది అమృత తర్వాత మంటపంలో నిలబడి చేతులు జోడించి గర్భ గుడిలోకి చూసిన – ఆమె కళ్ళను ఆమే నమ్మలేక పోయింది

వ్యక్తుల రాకను గమనించి చదువుతున్న గీతను ప్రక్కకు పెట్టి శరగోపం తీసుకొని ఇవతలికి వచ్చిన గుడి అర్చకుడు ఎవరో కాదు – గోవిందయ్య! అమృత తండ్రే!

ఆ తండ్రీ కూతుళ్ళు ఒకరి కంటికి ఒకరు కనిపించాక – ఇద్దరికీ దుఃఖం ఆగలేదు అమ్మా అంటూ గోవిందయ్య, నాన్నా అంటూ అమృత ఇద్దరూ బావురుమన్నారు అదొక అపూర్వ సమాగమం

నేను నిన్ను తిరిగి చూడలేనేమోనని అనుకున్నాను నాన్నా అంది అమృత తేరుకొని

నాకూ అంతే అనిపించిందమ్మా – అన్నాడు గోవిందయ్య కళ్ళు తడుచుకొని



మనం ఏమిటో అనుకుంటాం గాని దేవుడు ఉన్నాడు నాన్నా! ఆయన లీలలు ఎవరికీ అంతు బట్టవే లేకపోతే నేను ఈ ఊరు రావటమేమిటి నీవు నాకు ఇక్కడ తారస పడటమేమిటి! విడిపోవటం విధికృతంగానే జరిగినా ఇప్పుడు మన ఇద్దర్నీ ఒక దగ్గిర చేర్చింది మాత్రం ఆ భగవంతుడే నాన్నా! అంది అమృత

నిజమేనమ్మా ఇంతకూ నువ్వు ఈ ఊరు ఎలా రాగలిగావ్? – అనుమానం వచ్చి అడిగాడు గోవిందయ్య

రామదాసుగారు వాళ్ళ పిల్లలకు ఆయా కావాలని పత్రికాప్రకటన ఇచ్చారు ఏదో ఒక బ్రతుకు తెరువు అవసరమనిపించి నేను వచ్చాను అంది అమృత

కూతురి మాటలు వింటున్న గోవిందయ్య మనసు ఎటో పోయింది కొద్దిసేపు తర్వాత గుడ లోపలికి వెళ్ళి అరటి పళ్ళు తెచ్చి పిల్లలకు ఇచ్చి కాసేపు ఆడుకోండని ప్రక్కకు పంపాడు ఆపైన తన బాధను ఆపుకోలేక

బంగారం లాంటి భర్తను లంకంత ఇంటిని వదిలి ఇలా లోకుల పంచన చేరవలసిన ఖర్మ నీ కెలా పట్టిందమ్మా? అడిగాడు దుఃఖ స్వరంతో

కన్న తండ్రివి చిన్న తనంనుంచీ నా మనసు ఎరిగిన వాడివి – అటువంటి నువ్వే ఎవరో ఏదో అన్నారని నన్ను అనుమానించావ్ అమృత కంఠం పూడుకు పోయింది

అది నా అపరాధమేనమ్మా లోకులు కాకుల్లా పొడుస్తుంటే మనసు చెదిరి నీకు అలా ఉత్తరం రాసేసి ఇల్లు వదిలి వచ్చేశాను భగవదనుగ్రహంవల్ల ఈ ఊళ్ళో నాకు స్థావరం దొరికింది మనసు కొంత స్థిమిత పడిన తర్వాత నేను ఎంత అవివేకంగా ప్రవర్తించానో అర్థం చేసుకున్నాను అలా అని వెంటనే వచ్చి నీకు ముఖం చూపించటానికి నాకు సిగ్గు అనిపించింది జీవిత చరమాంకంలోనైనా వచ్చి నా తప్పులన్నీ ఒప్పుకొని నీ దగ్గరే ఉండిపోదామనుకున్నాను ఉత్తరం రాస్తే వెంటనే నువ్వు ఎక్కడ బయలుదేరి వస్తావో ఈ ముఖం నీకు ఎలా చూపాలో నన్న సిగ్గుతో నీకు ఉత్తరం కూడా రాయలేదు ఇప్పుడు చెప్పమ్మా నాలాగే నీ భర్తా వాళ్ళు నిన్ను అనుమానించి అవమానించారా? – తన మనోగతాన్ని వెల్లడించి సందేహం కలిగి అడిగాడు గోవిందయ్య

అలాంటిదేమీ జరగలేదు గాని – ఆయనపోయి చాలా కాలమైంది నాన్నా ఇక ఆ ఇంట్లో ఉండలేక అప్పుడే అక్కణ్ణుంచీ బయలుదేరి వచ్చేశాను – మామూలుగానే చెప్పింది అమృత

అల్లుడుగారు పోయారా! నువ్వు ఎప్పుడో ఇల్లు వదిలి వచ్చేశావా! అంటూ కూతురి వైపు వెర్రిగా చూడసాగాడు గోవిందయ్య

ఏమిటి నాన్నా అలా చూస్తున్నావ్? భర్త పోయినా నాలో వైధవ్యపు చిహ్నాలు కనిపించటం లేదేమనా? భర్తతో వచ్చిన తాళిబొట్టును మాత్రమే తీసి వేశాను చిన్నతనంనుంచీ ఓ ఆడదానిగా భగవంతుడు ప్రసాదించిన మంగళ చిహ్నాలను అలాగే అట్టి పెట్టుకున్నాను అంది అమృత

# స్వార్థంలేని చెట్టు

నీకు ప్రాణం దానం
చేసిందెవరు?
చెట్టు-నీ మిత్రం
నీకు నిలువ నీడను
ఇచ్చిందెవరు? చెట్టు కదా
నిన్ను దహించేదీ
నీ భారం వహించేది
చెట్టు
చెట్టును కొట్టకు
చెట్టును తిట్టకు
అది నిన్ను తిరిగి కొట్టదు, తిట్టదు
చెట్టుకు నీరు దానం చేస్తే
చక్కగా చిగురించి
నీవు పూర్వం వ్రాసుకుందుకు
ఉపయోగపడింది తాళపత్రం
నీ మిత్రం వృక్షం-
పూలు పూస్తుంది
ఆనందం ఆహ్లాదం
అందరికీ పంచుతుంది
నీ మనస్సులో
శాంతిని పెంచుతుంది
పండ్లు కాసి
నీ కడుపును నింపుతుంది
నీ స్వార్థం దానికి లేదు
పరమార్థం
తెలుసుకు మసులుకో
మానవుడా మానవుడా-

–ఎం. ఎస్. ఎం.

# ఒక అమ్మ కథ

నేను ఎవర్నీ ఏమి అనటానికీ అశక్తుడినమ్మా ఒకప్పుడు మొండి పట్టుదలకు పోయి చదువు విషయంలో నా ఆలోచన ప్రకారమే జరగాలని చివరికి మీ అన్నయ్య ఇంట్లోంచీ పారిపోయేలా చేశాను డాక్టరు సలహా పెడ చెవిన పెట్టి మీ అమ్మను పోగొట్టుకున్నాను పెళ్ళి చేయలేని అశక్తతతో ఒక వృద్ధుడికి కట్టబెట్టాను నిన్ను నీ వివాహంతో నా బాధ్యత తీరిపోయింది కానీ, నీ భవిష్యత్తే అంధకారమై పోయింది ఇంతకూ అల్లుడుగారు అలా అకస్మాత్తుగా పోయారేం? అడిగాడు

అంతావిధి వ్రాత ఆయన ఎలా పోయారంటే నేనేమీ చెప్పలేను నాన్నా అంది అమృత

నవీన్, ప్రవీణ్‌లు వచ్చి ఆంటీ, వెళ్దామా? ఇంటికి అని అడిగారు వాళ్ళకు ఇంత సేపూ గోవిందయ్య అమృత మాట్లాడుకున్న విషయాలు అంతుఖట్టలేదు

వెళ్దాం బాబూ ఇంకొంచెం సేపు ఆడుకోండి అని బుజ్జగించి వాళ్ళను కొద్ది వెడంగా పంపింది

అమ్మా! నా చివరి కోర్కెగా మరొక్కటి మిగిలి పోయింది మీ అన్నయ్య కృష్ణ మనసు మార్చుకొని వచ్చి నన్ను క్షమించానని చెబితే ఎంతో తృప్తిగా ఉంటుంది కన్న కొడుకుతో తల కొరివిపెట్టించుకొనే అదృష్టం?' అంటూ వాపోయాడు గోవిందయ్య

నీకోర్కె తప్పక నెరవేరుతుంది ఏనాటికైనా అన్నయ్య వెతుక్కుంటూ వస్తాడు నాన్నా మన దగ్గిరికి అంది తండ్రికి సంతృప్తి కలిగించటానికి తర్వాత, నీవు ఎక్కడ ఉంటున్నావ్? ఎలా వండుకొని తింటున్నావ్?" అంటూ ఆరాలు అడిగింది

ఈ ప్రక్కనే రామదాసుగారితోట ఉంది అందులో ఒక పాకవేయించి ఇచ్చారు ఆయనే ఇక నా తిండి గురించి తెలియంది ఏ ముంది నీకు? ఒక్కపూట భోజనం దేవుడికి ఎలాగో నివేదన చేయాలి-కదా? గిన్నెలు అవి తోమటానికి పనిమనిషి ఉంది – చెప్పాడు గోవిందయ్య

రేపట్నుంచీ ప్రొద్దుటిపూట నేను వంటచేసి పెడతాలె

వద్దమ్మా నువ్వు రామదాసుగారి ఇంట్లో ఉద్యోగార్థివై వచ్చావ్ ఆయన నీకు జీతం ఇస్తున్నారు కాబట్టి అక్కడే ఉండటం మంచిది ఒకవేళ బొత్తిగా చేతకాని రోజున రామదాసుగార్ని నేనే వచ్చి అడుగుతాను నిజానికి ఆయన దేవుడిలాంటి మనిషమ్మా

–గోవిందయ్య అమృతకు అలా చెబుతున్నప్పుడే రామదాసుగారు అక్కడికి రావటం జరిగింది పిల్లలను తీసుకొని దేవాలయానికి వెళ్ళిన అమృత తిరిగి రావటం ఆలస్యం కావటంతో సందేహం కలిగి స్వయంగా ఆయనే వచ్చారు

అప్పుడే గోవిందయ్య, అమృతలు తండ్రీ కూతుళ్ళన్న సంగతి తెలిసి పోయింది రామదాసుగారికి అందుకు మొదట ఆశ్చర్యపోయినా తర్వాత ఎంతో ఆనందించారు ఆయన

39

రోజులు ప్రశాంతంగా గడిచిపోతున్నయ్ ప్రతిరోజూ పిల్లల్ని తీసుకొనిగాని, ఇంటిదగ్గరే వదిలి-

# మాటలకు మౌనానికి మధ్య మధురక్షణాలు

ఏదియేమయినా పరవాలేదనుకొనే మధుర క్షణాలు మీ జీవితంలో ఎన్నో. మౌనసామ్రాజ్యం వొడిలో ఉద్వేగపూరితమైన నవ్వుతో—ఏకమైన వేళ. ఇంకెవ్వరూ, కాదు ఈ ప్రపంచమే ఏమైనా ఫరవా లేదు నిజమే. మీకు ఈ మధుర క్షణాలకు మధ్య ఏదీ అడ్డురాకుండా ఉండేందుకు అవసరమైనది కోహినూర్ లేత ఎఱుపు మీ మృదువైన ఆలోచనలకు సున్నితత్వానికి రక్షణనిస్తుంది శ్రేష్ఠమైన లేటెక్స్‌తో తయారుచేయబడినది పూర్తి రక్షణ నివ్వడానికి ఎలెక్ట్రానిక్ సాధనాలతో పరీక్ష చేయబడినది. మృదువుగా ఉండేందుకు ల్యూబ్రికేట్ చేయబడింది.




**KOHINOOR**

లేత ఎఱుపు సుకుమారమైన కండోం

**ttk** తయారి.

గాని తను దేవాలయానికి వెళ్ళి ప్రశాంతంగా కూర్చోవటం అసంభవమనుకొని తనకై ప్రత్యేకించిన గదిలో ఒక చిన్న దైవమందిరాన్ని ఏర్పాటు చేసుకొంది అమృత వేణువు ధరించిన కృష్ణుడు ఆమె దైవం

తెల్లవారు ఝామునే లేచి చన్నీటి స్నానచేస వచ్చి దైవమందిరం ముందు కూర్చొంటుంది రోజూ అలా గంట రెండు గంటలు గడిచాక గదినుంచీ బయటికి వస్తుంది అప్పటికి ఇంకా పిల్లలు నిద్రలేవరు వాళ్లనులేపి దంతధావనం – ఆ వెంట వేడినీళ్లతో స్నానం చేయించి దగ్గిర కూర్చుని టిఫిన్ తినిపించి పాలు త్రాగిస్తుంది తర్వాత తనగదిలో కూర్చోబెట్టుకొని చదువు నేర్పుతుంది - ఇది అమృత దిన చర్య

పిల్లల విషయంలో ఆమె తీసుకుంటున్న శ్రద్ధకు ఎంతో సంతృప్తి చెందుతున్నారు రామదాసుగారు కాకపోతే అమృత అంతతెల్లవారు ఝామున లేవటం చన్నీటి స్నానం చేయటం గదిలో దేవుడి విగ్రహం

ముందు గంటల తరబడీ కూర్చోవటం అటువంటి సమయంలో ఎవరు పిలిచినా పలుకక పోవటం అదే అర్థం కావటంలేదు ఆయనకు

రామదాసుగారు కూడా బాగా చదువుకున్న వ్యక్తి మంచితత్వవేత్త, వేదాంతి! ఎన్నో ఉద్గ్రంధాలు ఉన్నయ్ వాళ్ల ఇంట్లో ఆయనా ప్రతిరోజూ తెల్లవారు ఝామునే లేస్తాడు గీతా పారాయణం చేస్తాడు – అందువల్ల అమృత తీరును ఒక కంట కనిపెట్టటం జరుగుతోంది

అమృతా! ప్రతిరోజూ అలా చన్నీటి స్నానం చేస్తున్నావ్ ఒంటికి మంచిదికాదేమో? – మనసులో కొట్టుమిట్టాడుతున్న అన్ని సందేహాలను తీర్చుకోవటానికి ఆ రోజే మంచి ముహూర్తం అన్నట్లు మొదలుపెట్టారు ఒక సాయంత్రం

చన్నీటి స్నానం చిన్నతనంనుంచీ నాకు అలవాటే బాబుగారూ అంది రామదాసుగార్ని ఊళ్లో అందరిలోనే తనూ బాబుగారు అని అనటం అలవరచుకొంది అమృత

నీకు దేవుడిగా కృష్ణుణ్ని ఎంచుకున్నావ్ ఏమని కోరుకుంటున్నావ్ ఆయన్ని? సంభాషణ పొడిగించటంకోసం అడిగారు రామదాసు

# ఒక అమ్మ కథ

మా నాన్నగారు వేణుగోపాల స్వామి ఆలయంలో అర్చకుడిగా ఉండేవారు మా ఊళ్లో నా చిన్నతనంనుంచీ ఈయన్ని కొలవటం అలవాటైపోయింది - పేర్లు విగ్రహ స్వరూపాలు ఏవిమారినా సర్వాంతర్యామియైన భగవంతుడు ఒక్కడే! ఇప్పుడు నా గదిలో కృష్ణుడి విగ్రహం పెట్టటం అది అందుబాటులో దొరకటమే బాబుగారూ దైవాన్ని నేను ఎప్పుడు కోరుకున్నా మనశ్శాంతిని ప్రసాదించమనే" – చెప్పింది అమృత

మనశ్శాంతి కోసం అంత పరితపిస్తున్నావంటే నీవు ఎంతో అశాంతికిలోనై ఉండాలి జీవితంలో

డబ్బు సంపాదించాలనుకొనే వాళ్లంతా దరిద్రులేనని అనగలరా?

ఎలా అంటాను అమృతా? 'ధన మూల మిదం జగత్ అంటారు డబ్బు లేకుండా మనిషి బ్రతకలేడు ప్రతి మనిషీ ఫలానంతవరకే సంపాదించాలని పరిమితి విధించుకొంటే నేటి సంఘ స్వరూపమే మారిపోతుంది

బతుకటం పేరున డబ్బు ఉన్నవాడు, లేనివాడు కూడా దాన్నే సంపాదించటానికి ప్రయత్నిస్తున్నాడు అలాగే అశాంతి పరితుల్లైనవాళ్ళు మాత్రమే ప్రశాంతతను కోరుకుంటారంటే నేను ఒప్పుకోను ఆత్మధనం సంపాదించటానికి కూడా ఒక పరిమితి అంటూ లేదు బాబుగారూ

సరేనమ్మా నీ అభిప్రాయాన్నికాదని కొట్టివేయలేకపోతున్నాను కాకపోతే నీవు దైవ మందిరం ముందు కూర్చున్న తర్వాత ఎవరు పిలిచినా పలుకవేం చాలాసేపటి వరకు?

ఏమో బాబుగారూ అది నాకు తెలియదు దైవాన్ని స్మరించుకొంటూ మందిరం ముందు కూర్చునేంతవరకే నాకు గుర్తుంటుంది కొద్దిసేపు నేను ఆరాధించే దైవం రూపం మనసులో మెదలుతుంది తర్వాత అంతా శూన్యం, నిస్తబ్దత చివరికి ఎలా తెలివి వస్తుందో?

అంటే – నువ్వు మనసును అదుపు చేసుకోగల శక్తిని సంపాదించావన్నమాట ఇది ఎంతో ఉత్కృష్టమైన విద్యమ్మా దీన్ని సాధించగలగటం అపురూపమే! అసలు ఈ దైవ ధ్యానం, ఏకాగ్రత నీకు ఎప్పుడు అలవడ్డాయమ్మా?

మా అమ్మగారు పోయినప్పటినుంచీ నా మనసుకు ఏమిటో అశాంతి అనిపించి అప్పుడప్పుడు తదేకంగా దైవ ముందు కూర్చునే దాన్నండీ తర్వాత ఎవరైనా కష్టపెట్టినప్పుడు అలా చేసేదాన్ని వివాహమైన తర్వాత ప్రతిరోజూ దైవ ధ్యానం చేయటం అలవాటైపోయింది నా భర్త, అత్తగారు ఎంతో ఉత్తములు వాళ్ళు నన్ను ఏ విధంగానూ అడ్డగించలేదు అప్పట్నుంచీ నేను ఏ పరిస్థితిలో, ఎక్కడ ఉన్నా నా ధ్యానాన్ని మాత్రం వదులుకోలేదు

ఐతే నీది అసాధరణ వ్యక్తిత్వం అమ్మా! ఇన్ని సంవత్సరాలు వచ్చినయ్ – గీతా పారాయణ చేయటం, సుందరాకాండ చదువుకోవటం నాకు నిత్యకృత్యం మిగతా సమయాల్లోనేకాదు అవి పఠిస్తున్నప్పుడు కూడా నా మనసును ఏకాగ్రతగా ఉంచుకోలేను ఏవో సమస్యలు, వ్యవహారాలు ఈ మెదడును అనుక్షణం తొలిచివేస్తూనే ఉంటయ్ అంతేకాదు అమృతా ఉప్పుకారం తింటూ. వ్యామోహపరుల్లైన మనషుల మధ్య మసలుకుంటూ కూడా – నువ్వు ఏకాగ్ర చిత్తాన్ని సంపాదించటం!నా మట్టుకు నేను గొప్ప విషయంగానే భావించుకొంటున్నాను

నన్ను గొప్పదాన్నిచేసి నాది అసాధారణ వ్యక్తిత్వం అని పొగిడి ఇబ్బంది పెట్టకండి బాబుగారూ ఒక విధంగా ఆలోచిస్తే నేను విచిత్ర వ్యక్తిని మనిషిగానే పుట్టినా మానవ సంబంధమైన లాలస కోర్కెలు వ్యామోహం నాలో ఏ కోశానా లేవు అవే ముఖ్యమనుకొంటే అంది వచ్చిన అవకాశాలను ఉపయోగించుకొని ఎంతో ఘనంగా బ్రతకగలిగేదాన్ని ఈనాడు కానీ, భౌతికపరమైన లొంగుబాట్లకు నా మనసు అంగీకరించని కారణంగానే జీవితంలో నాకు స్థిరత్వం అంటూ లేకుండా పోయింది నగరాల్లో లభించని ప్రశాంతత పల్లెపట్టున దొరుకుతుందన్న ఆశతో ఈ మారుమూల గ్రామానికి రావటం జరిగింది, మీ పత్రికా ప్రకటన చూసి కేవలం పొట్ట పోసుకోవటానికే ఐతే నేను ఇంతదూరం

రానవసరంలేదు మరోమాట బాబుగారూ, నాకు బంధు ప్రీతి కూడా అనిపించదు ఏదో మానవత్వం-కోసం ఎదటివాళ్లను గౌరవించటం అబిమా-నించటం జరుగుతుందేగాని ప్రేమపాశాలు నన్ను పట్టిపీడించవ్'

"నువ్వు అన్నిటికీ అతీతురాలివి అమృతా! నీలాంటి వ్యక్తిని చూడటం, నువ్వు మా ఇంట్లోనే సంచరిస్తూండటం – అంతా నా అదృష్టంగా బావించుకుంటున్నాను

–తర్వాత మరి వాళ్ల సంభాషణ సాగలేదు ముందుకు అందులో ప్రొద్దుగూగింది లైట్లు వెలిగించారు పిల్లలను చదివించే వేళైంది అమృతకు రామదాసుగారు గదిలో పడుకొని ఉన్న బార్య యశోద ఆరోగ్య విషయం తెలుసుకొనేందుకు వెళ్లార్లు

అది మొదలు రామదాసుగారికి, అమృతకు మధ్య ఏదో విషయం మీద చర్చ జరగటం రివాజైపోయింది విషయం ఆధాత్మికం, లౌకికం – ఏదైనా కావచ్చు చివరికి ఇద్దరూ ఒకరి అభిప్రాయాలు ఒకరకం తెలుసుకున్నాంలే అని తృప్తి పడతారు మిగిలిన ఖాళీ దినాల్లో రామదాసుగారి దగ్గిర అనేకానేక గ్రంధాలను ఒకటొకటే చదవటం మొదలు పెట్టింది అమృత

కొండపాడు వచ్చినవారం రోజులకు ఆనంద్‌కు, తానిక్కడ ఎంతో ప్రశాంతంగా జీవించగలుగు-తున్నట్లు, తిరిగి చూసేప్రాప్తం ఉందో లేదో అనుకున్న కన్న తండ్రి కనిపించినట్లు– ఎంతో ఆశావహంగా ఉత్తరం వ్రాసింది అమృత ఆనంద్ మాత్రం కొంచెం ఆలస్యంగా జవాబు రాశాడు-అందుకు కారణంగా 'తన భార్యను తీసుకుని స్వగ్రామం వెళ్లినట్లు, విజయతో తన వివాహ బంధాన్ని తల్లి దండ్రులు ఆమోదించినట్లు, దాంతో తను, విజయ అక్కడే కొద్ది రోజులు ఉండిపోయినట్లు, అందువల్లనే వెంటనే తిరుగు జాబు వ్రాయలేక పోయినట్లు– వివరాలు తెలిపాడు దానిలో

తర్వాత మధు దగ్గిర నుంచీ ఉత్తరం వచ్చింది

పిన్నీ! నీ గురించిన వివరాలు ఆనంద్‌కు ఉత్తరం రాసి తెలుసుకున్నాను నీవు ఎక్కడో మారు మూల ఉన్న కొండపాడు వెళ్లి– ఆయాగా ఉద్యోగం చేయటం తలుచుకుంటే నా కెంతో బాధగా ఉంది కాకపోతే ఆ ఊరు వెళ్లబట్టే మీ నాన్నగారు తిరిగి నీకు కనిపించారని తెలిసినప్పుడు మాత్రం నాకెంతో ఆనందం అనిపించింది ఐతే ఒక విషయం నీకు చివరిగా స్పష్టం చేయదల్చుకున్నాను పిన్నీ నీవు కీ॥శే సుందర రామయ్యగారి భార్యవి ఆయన ఆస్తి పాస్తులలో నీకూ హక్కు ఉంది ఒక స్థితిపరురాలి-వైన నువ్వు పరుల ఇంట ఉద్యోగం చేయటం నాకు ఇష్టం లేదు త్వరలో నేను వస్తాను అని ఉంది

అందులో కాని అతని దోరణి మాత్రం పట్టించు-కున్నట్లులేదు అమృత ఆ ఉత్తరంచదివిన తర్వాత ఒక్కసారి గట్టిగా నిట్టూర్పు వదిలింది అంతే

తను ఉత్తరంలో పేర్కొన్నట్లే ఒక నెల రోజుల వ్యవధి ఇచ్చి వచ్చాడు మధు తను కూడా ఒక ప్లీడర్ని కూడా వెంట బెట్టుకొచ్చాడు

పిన్నీ మా నాన్నగారి ఆస్తి పాస్తుల్లో నీ వాటా నీకు బాగించి ఇవ్వటం నా కనీస దర్మం అందుకే ప్లీడరుగారిని తీసుకు వచ్చాను అన్ని పత్రాలు ఆయన సిద్ధం చేసే ఉంచారు నీవు చేవ్రాళ్ళు పెట్టి దస్తావేజులు తీసుకో" అంటూ తను వచ్చిన వివరం బయట పెట్టాడు మధు, అతిథి మర్యాదలన్నీ పూర్తైన తర్వాత

నీ ఇష్టం మధు బాబూ నిజానికిఆస్తి పాస్తులు నాకు అనవసరం – అది అమృత నిర్లిప్తంగా

అలా అనకు పిన్నీ ఈ ఆధునిక ప్రపంచంలో దేనికైనా డబ్బే ముఖ్యం అదీ కాకుండా కాలం ఒకే రీతిగా ఉండదు రేపు నాకే దుర్బుద్ధి పుట్టి నీకు నిలువ నీడ లేకుండా చేసినా చేయవచ్చు అందుకే తొందరపడి ఇలా చేశాను "– నిష్కపటంగా చెప్పాడు మధు

సరే మధుబాబూ! ఏదో లోకరీతి కోసం, నీ ఆత్మ తృప్తి కోసం ఆస్తికి సంబంధించి ప్లీడరుగారు అందించే పత్రాలను తీసుకుంటాను ఫలసాయం మాత్రం నీవే అనుభవించాలి అలా కాగితం వ్రాసి ఇస్తాను నేను నీవూ నామాట కాదన కూడదు "

నీ ఇష్టం పిన్నీ ఇప్పుడు పంచి ఇచ్చేవన్నీ నీవే ఏ నాడువచ్చి అడిగితే ఆ నాడు వాట్ని నేను నీకు అంద జేస్తాను

– యీ తీర్మాన మైపోయింది వాళ్లిద్దరి మధ్య సంభాషణ జరిగేటప్పుడు రామదాసుగారు కూడా అక్కడే ఉన్నారు రాతకోతలై పోయిన తర్వాత అందరూ కలిసి దేవాలయానికి వెళ్లి గోవిందయ్య గార్ని చూశారు– ఆ రాత్రి బస్‌కే ప్లీడరుగారితో కలిసి వెళ్లిపోయాడు మధు

## 40

కాల ప్రవాహం వేగంగా పరుగులు తీస్తూనే ఉంది రోజులు వారాలు నెలలుగా నెలలు సంవ్స-రాలుగా మారుతున్నాయి

పిల్లలకు గ్రాహ్యకం వచ్చిందని నవీన్ ప్రవీణ్-లను దగ్గరలో ఉన్న పట్నం తీసుకు వెళ్లి ఒక కాన్వెంటు స్కూల్లో చేర్పించి, హాస్టల్లో పెట్టిం-చారు రామదాసుగారు ప్రతి ఆదివారం ఇతర శలవు దినాల్లో తనువెళ్లి వాళ్లని చూసి వస్తున్నాడు టర్మ్స్ హాలీడేస్‌లో పిల్లల్ని ఇంటికి తీసుకు వస్తు-న్నారు

ఇక పిల్లలు పట్నంలో ఉండటం మొదలు పెట్టిన తర్వాత అమృత తన తండ్రి పంచకు చేరింది

అదేమిటమ్మా! నీవు మాకు తిండిబారమని అను-కున్నావా? లేక ఇది నీకు పరాయి ఇల్లు అని బావించుకున్నావా? నువ్వు మా ఇంటికి వచ్చిన తర్వాత మా మనసులకు ఏదో కొత్త వెలుగు వచ్చినట్లు బావించుకున్నాం ఆడ పిల్లలు లేని లోటు నీ ద్వారా భర్తీ అవుతోందని మురిసి-పోతున్నాం నేను, మా ఆవిడ మీ నాన్నగారేమో ప్రొద్దస్తమానం దేవాలయంలో ఉంటుంటారు అక్కడికి వెళ్తే అంతపెద్ద తోటలో బిక్కు బిక్కు మంటూ ఒంటరిగా ఎలా ఉంటావ్? అంటూ అభ్యంతరపెట్టారు రామదాసుగారు

బాబుగారూ! మీ అబిమానానికి కృతజ్ఞురాల్ని ఐతే నేను ఒక ఉద్యోగినిగా మీ ఇంట్లో అడుగు



# ఇ'వేమన'పద్యాలు




ఒడలు నల్లనైన నోర్పడి సతియైన
గుణము గలిగినేని కోటి సేయు
వాత యెనుము పాలు రోతన వచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ.

...చ్చాను వచ్చి పిల్లలు చదువుల నిమిత్తం ఎప్పుడు పట్నం వెళ్లాలో అప్పుడే నా ఉద్యోగ బాధ్యత తీరిపోయింది ఇక ఉచితంగా మీ ఇంట్లో ఉండటానికి ఏ మాత్రం మనస్కరించటంలేదు ఏదైనా నాకు మీరన్నా అమ్మగారన్నా ఎంతో గౌరవం ఉంది నిజానికి మీ ఇద్దరూ నన్ను కన్న కూతురి కంటే మిన్నగానే చూసుకున్నారు మీకు దూరంగా ఉండాలని నాకూ లేదు కాకపోతే ఎదురైన సమస్యే వేరు నా కన్న తండ్రి పట్ల నెరవేర్చవలసిన కనీస

## ఒక అమ్మ కథ

ధర్మం ఒకటుంది ఈ వయసులో ఆయన కష్టపడి వండుకు తింటున్నారు అది నాకు ఇష్టం లేదు నేను వేరే ఉన్నా రోజూ మీ ఇంటికి వచ్చి వెళ్తూనే ఉంటాను బాబుగారు – అంటూ చెప్పి మొత్తానికి రామదాసుగార్ని ఒప్పించింది నిజానికి అంత పెద్ద తోటలో మీ నాన్నగారు లేనప్పుడు బిక్కు బిక్కు-మంటూ ఎలా ఉంటావమ్మా? అంటూ ఆయన భయపడుతున్నారుగాని ఆ తోటల్లో ఒంటరిగా ప్రశాంతంగా ఉండాలని తను ఎంతగా ఉబలాట పడుతోందో?

అమృతమాట ఇచ్చిన ప్రకారమే రోజుకు ఒకసారి రామదాసుగారి ఇంటికి వచ్చి ఎంతో కొంతసేపు గడిపి వెళ్తోంది ఆనంద్ విజయతో కలిసి ఒకసారి వచ్చాడు వాళ్లకు ఒక మగబిడ్డ కలిగాడు పసి వాణ్ణి అమృత చూసింది

మధు తరచు ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నాడు ఆస్తిపాస్తులమీద వచ్చే ఫలసాయాన్ని నీవు స్వచ్ఛందంగా వదులుకున్నా నాకు దాన్ని పూర్తిగా అనుభవించటానికి మనస్కరించటంలేదు నీ అవసరాలకు ఉపయోగపడుతుంది కాదనకుండా తీసుకో పిన్నీ' అంటూ మధ్య మధ్య మనియార్డర్లు చేస్తున్నాడు మధు మంచితనాన్ని కాదనలేక-పోతోంది అమృత

కాలం గడిచిపోతూండగానే తిరిగి మధు ఒక ముఖ్య విషయం వ్రాశాడు, 'పిన్నీ' బామ్మ పరిస్థితి విషమంగా ఉంది కడసారిగా నిన్నొకసారి చూడాలని ఆశపడుతోంది వస్తావని తలుస్తాను అంటూ

తనంటే ఎంతో అభిమానించే అత్తగారి పరిస్థితి విషమంగా ఉందని తెలిసిన తర్వాత, అంతిమంగా ఆ పెద్దావిడకు మనశ్శాంతి కలిగించటం విధిగా భావించి – తన అత్తగారి ఊరు బయల్దేరి వెళ్లింది అమృత తండ్రిని వెంట తీసుకొని

గోవిందయ్య, అమృతలను చూశాకే కళ్లు మూసింది నాంచారమ్మ తండ్రిని మరునాడే కొండపాడు పంపి తనుమాత్రం కర్మకాండాలు పూర్తయ్యేవరకు అక్కడే ఉండిపోయింది ఆ కొద్ది-రోజుల వ్యవధిలోనూ ఆ గ్రామస్తుల్లో ఇప్పుడు తన పట్ల వచ్చిన మార్పును గమనించగలిగింది అమృత ఎవరు కనిపించినా ఆమెతో ఎంతో గౌరవించి మాట్లాడుతున్నారు మరి!

మరొకసారి ఆనంద్ వచ్చినప్పుడు మరికొన్ని విషయాలు చెప్పాడు, 'మద్రాసులో లలితాబాయి నిర్వహిస్తున్న సేవా సదనంమీద పోలీస్ రైడింగ్ జరిగిందనీ, ఆమెను అరెస్టు చేశారనీ, శ్రీ కుమారి (శ్యామ) సినీఫీల్డులో స్థిరపడి ఉత్తమనటిగా అవార్డులు అందుకొంటోందనీ, ఇప్పుడు శ్రీ కుమారి లేని పిక్చర్లలో వీరేన్ నటించటంలేదనీ – వాళ్లిద్దరి-మీదా కొన్ని సినిమా పత్రికల్లో ఊహాగానాలు వస్తున్నయనీ' అంటూ

అమృత విని ఊరుకొంది తప్పితే వ్యాఖ్యానం చేయలేదు రామదాసుగారింటికి పత్రికలు వస్తూనే ఉంటయ్ అమృత కూడా తిరగవేస్తూనే ఉంటుంది వాట్ని ఐతే అంతగా ఆసక్తి కనపరిచి చదవదు

(ఇంకా ఉంది)




**ఎస్. ఐ. – మోదుకూరు**

నా వయస్సు 22 సంవత్సరములు నాకు 10 సంవత్సరముల వయస్సు వున్నప్పుడు కుడి కాలు సైకిల్ చక్రం క్రింద పడి ఎముక విరిగినది 3 నెలలు సిమెంటు కట్టు అనంతరం పూర్తిగా తగ్గినది 1 సంవత్సరము నుంచి ఎక్కువ దూరం నడిచినా, ఇంట్లో ఎక్కువ తిరిగినా కాలు బాగా నెప్పిగా వుండి నడవటం కష్టంగా వుంటోంది కాలు కదల్చటం గూడా కష్టముగా వున్నది రెండు రోజులు తర్వాత బాగానే వుంటోంది ఇలా ఎందుకు జరుగుతోంది?

★ చాలా కాలంగా శరీర భాగాన్ని మడవకుండా ఉండటం వల్ల కండరాలు పటుత్వం తగ్గిపోతుంది అవి కృశించి పోవటమే దీనికి కారణం

ఫిజియో తేరపీ వల్ల (క్రమబద్ధమైన వ్యాయామం) పరిస్థితి కొన్నాళ్ళలో మెరుగవుతుంది

**బి. ఆర్. కె. – విశాఖపట్నం**

నా వయస్సు 17 సంవత్సరములు నేను మాట్లాడే ప్రతి మాట యితరులకు అర్థమవటం లేదు ఎంత మెల్లిగా మాట్లాడదామంటే అంత వేగంగా మాట్లాడ గల్గుతున్నాను మీ సలహా ఏమిటి?

★ మీరు స్పీచ్ తేరపిస్టుల సలహా పొందటం మంచిది ఇదే నా సలహా!

**ఎమ్. బి. ఎన్ – బళ్లారి**

నాకు 7, 8 సంవత్సరముల నుండి కడుపు నెప్పిగా వుంటుంది డాక్టరు 'పెప్టిక్ అల్సర్' వుందన్నారు మాత్రలు వాడినాను కాని నెలకు ఒకసారి కడుపు నెప్పి వస్తూ వుంటుంది నాకు పెండ్లి అయి 2 సంవత్సరములు అయినది ఈ వ్యాధి నా భార్యకు కూడా వస్తుందేమోనని నాకు భయంగా వున్నది ఈ నెప్పి రాకుండా ఏమైనా మందులు వుంటే తెల్పండి

★ కొన్నాళ్లపాటు ఉండి, మరి కొన్నాళ్లు లేకపోటం ఈ రోగ ప్రత్యేకత పెప్టిక్ అల్సర్ ఒకరి నుంచి మరొకరికి వచ్చే అవకాశం లేనే లేదు నెప్పి రాకుండా యాంటాసిడ్ మాత్రలను వాడటం మంచిది సిమెటిడిన్ అనే మందుని వైద్యుల సలహా

# ధర్మపథం



## సంప్రదాయాల మార్పు

మన పూర్వులు ఏర్పరచిన సంప్రదాయాలు మానవ జీవితానికి సంబంధించి ఉంటాయి సంవత్సరాది మొదలుకొని, సంవత్సరం పూర్తి అయే వరకూ ఎన్నో పర్వ దినాలు మనకు ఉన్నవి అన్ని మతాల వారికీ, వేర్వేరు దినాలలో ఇవి వస్తాయి మన పర్వాలలో కొన్నిటిని మనం ఎక్కువ ఆర్భాటం లేకుండా సామాన్యంగా పాటిస్తాము కొన్నిటిని వైభవంగా పండుగలుగా భావించి జరుపుకొంటాము

ఈ సంప్రదాయాలు చాలా అర్థవంతంగానే ఏర్పాటు చెయ్యబడి ఉన్నాయి శ్రీ రామ నవమి, శ్రీ కృష్ణాష్టమి, శివరాత్రి మున్నగు పర్వాలలో ఆయా దేవతలను పూజించడం, ఉపవాసం ఉండటం సంప్రదాయం ఆ విధంగానే దీపావళినాడు సాయంకాలం వరుసగా దీపాలు పెట్టడం సంప్రదాయం కాని కొన్ని చోట్ల ఈ సంప్రదాయాలు మారిపోయాయి ఎవరో ఒకరు, బాగా పలుకుబడి ఉన్నవారు అర్థం లేకుండా సంప్రదాయాన్ని మారుస్తే గతాను గతికంగా ఇతరులు ఆ పద్ధతినే అవలంభించడం జరుగుతూ ఉన్నది "గతానుగతికో లోకః నలోకః పారమార్థికః" అనే లోకోక్తి ఉండనే ఉన్నది గదా! లోకం గ్రుడ్డిగా ఇతరులను అనసరిస్తుందే కాని, యదార్థాన్ని గుర్తించదని దీని భావం ఉదాహరణకు రెండింటిని తీసికోవచ్చు

దీపావళి నాడు సాయంకాలం దీపాలను వరుస వరుసలుగా ప్రమిదలతో వెలిగించి పూజించడం సంప్రదాయం దీనిని బట్టే ఆ పర్వానికి దీపావళి అనే పేరు వచ్చింది దీనిని ఆంధ్రులు పాటిస్తారు కాని తమిళనాడులో అన్ని పండుగుల కన్నా దీపావళి ముఖ్యమైనదిగా భావిస్తున్నారు. దీపావళినాడు తమిళులు దీపాలు పెట్టరు ఆ పర్వం వారికి మామూలు అమావాస్య వంటిదే! నరక చతుర్దశియే వారికి ముఖ్యం టపాసుల ఆర్భాటం ఆనాడే! తలంట్లు, భక్ష్యాలు ప్రధానం మనం దీపాలు వరుసగా పెట్టడం వారికి వింతగా తోస్తుంది ఈ పద్ధతి ఎలా వచ్చిందో! ఇది మనకు వింతగానే తోస్తుంది

శివరాత్రి రోజున రాత్రి జాగరం చేసి శివుని పూజించడం సంప్రదాయం విజయనగరం దగ్గర ఉన్న రామతీర్థం. విష్ణు క్షేత్రమయినా, ఆనాడు వేలకొలదీ పాటక జనం వనవాస రాముని దేవాలయానికే వెళ్ళి ఆ రాత్రి అక్కడే జాగారం చేస్తారు గాని, ప్రక్కనున్న శివాలయానికి వెళ్ళనే వెళ్ళరు ఈ పద్ధతి ఎలా వచ్చిందో తెలియదు ఇలా సంప్రదాయాలను అర్థం చేసుకోకుండా విరుద్ధమైన సంప్రదాయాలు, సంప్రదాయలుగా చెల్లుబడి అవుతూ ఉన్నవి.

—బులుసు వేంకటరమణయ్య

మేరకు వాడటం వల్ల మంచి ఫలితాలు కనబడుతున్నాయి మాత్రల వాడకంతో బాటుగా ఆహారంలో కారం, పులుపు తగ్గించటం అవసరం ఒక నిర్ణీత సమయంలో ఆహారం తీసుకొంటూ రావాలి పొగ త్రాగటం, మద్యపానం నిషేధం, ఊరగాయలు, మసాలా దినుసులు వాడకూడదు

### ఎన్. హెచ్. బి. – తిరుపతి

నా భార్య వయస్సు 35 సంవత్సరములు ముగ్గురు పిల్లల తల్లి 11 సంవత్సరముల మా అమ్మాయికి, 9 సంవత్సరముల మా అబ్బాయికి, నా భార్యకీ అప్పుడప్పుడూ దగ్గు వస్తూ వుంటుంది తుమ్ములు అధికంగా వస్తాయి ఇలా దగ్గు, తుమ్ములూ రాకుండా వుండే మార్గం చెప్పండి

★ దీనికి వంశపారంపర్యంగా వచ్చే అలర్జీ, రోగ నిరోధక శక్తి లేక పోవటమే కారణం ఇ ఎన్ టి వైద్యులను కలవండి తాత్కాలిక ఉపశమనంగా అవిల్, పిరిటాన్ వంటి మాత్రలు, ముక్కులోకి ఆట్రివిన్ అనే డ్రాప్స్ వాడటం మంచిది

### యస్. యస్ – హైదరాబాద్

నాకు సంవత్సరము క్రితం రక్తపు వాంతులు, విరోచనాలు అయినవి. ఎండోస్కోపి పరీక్ష చేయించుకుంటె క్యాప్‌లో 3 మి మి. డియోడినల్ అల్సర్ వుందని తేలింది దీనిని ఇంకా చికిత్స తీసుకుంటూనే వున్నాను ఒకసారి ఇలా అయిన తరువాత మరలా ఇలానే అవుతూ వుంటుందా? ఇలా అవటానికి కారణమేమిటి? ఇక ముందు మరోసారి ఇలా కాకుండా వుండాలంటె తీసుకోవలసిన జాగ్రత్తలేమిటి?

★ ఒకసారి రక్తస్రావం జరిగితే జాగ్రత్తగా ఉండటం అవసరం. ప్రతిసారీ రక్తం వస్తుందని కాదు. పుండు ఎక్కువ అయి మళ్ళీ రక్తస్రావం జరిగే అవకాశం ఉంటుంది వైద్యుల సలహా ప్రకారం మందులు వాడుతూ ఉండటం, సిగరెట్, మద్యం మొ వి వాడకపోవటం, ఆహారంలో కారం, పులుపు, మసాలా దినుసులు వాడక పోవటం తీసుకోతగిన ఇతర జాగ్రత్తలు □

# ఆప్కో హరివిల్లులు- మీ సౌందర్యాన్ని ఆరాధించే విరిజల్లులు

ఇంద్రధనుసు రంగులన్న,పరువాల పొంగులను కలబోసి నేసినవి ఆప్కో చేనేత చీరలు. మీ అందాలను ఆరాధిస్తా యి, మీ తనువు మీద తనరారగా కలవరిస్తా యి ఆప్కో చేనేత చీరలు. మీరు మనసారా ఆదరి స్తేనే, ఆనందంతో ధరి స్తేనే ఆప్కో వస్త్రా లకు సంతృప్తి !! చేనేత కళాకారులకు నవశక్తి ! ఆప్కో వస్త్రా లు ధరించండి ! ఆనందంతో తరించండి !!




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కో ఆపరేటివ్ సొసైటీ
లిమిటెడ్
హైదరాబాద్-500029

**ఆప్కో చేనేతలు**

kiron/apco/8487